అవనుక్కు శేషప్పట్టిరుక్కిఱ నామ్ సర్వశేషియాన అవనతు తిరువరుళై ఉపాయానుష్ఠానఙ్గళాలే వలియ క్కొణర్వోమెన్బదు నమ్ స్వరూపత్తుక్కు త్తకాదు. ఆదలాల్, ఆళ్వార్కళ్ వేఱొరు ఉపేయత్తై అఱియాద వాఱుపోల వేఱొరు ఉపాయత్తైయుమ్ అఱియాదే యిరుప్పర్కళ్. "ఆఱెనక్కు నిన్ పాదమే శరణాక త్తన్దొళిన్దాయ్" (తిరువాయ్-5-7-10) ఎన్బర్కళ్. ఇక్కొళ్కైక్కు మాఱాక - "కరుమఞానఙ్గళినాల్ నిర్మలమాన మనస్సై యుడైయవనాల్ శెయ్యప్పడువతుమ్, తైలధారైపోలే ఇడైవిడాద ధ్యానపరంపరా రూపమాన భక్తియే ఉపాయమ్" ఎన్ఱు వైదికర్కళుమ్ శొల్లుకిఱార్కళే! ఇ.ʼ.దు ఎన్న అఱియామైయో! ఎన్నుమ్ ముకత్తాల్ ఎమ్బెరుమానుడైయ ఉపాయత్వత్తై వఱ్పుఱుత్తుకిన్ఱార్.

నామ్ శెయ్యుమ్ నఱ్కారియఙ్గళ్ ఎమ్బెరుమానై ప్పెఱువదఱ్కు ఉపాయ మల్ల - ఎన్ఱు శొల్లివిట్టాల్, నామ్ ఒన్ఱైయుమ్ శెయ్యామలే ఇరున్దువిడలామన్ఱో! ఎన్ఱుమ్, శాస్త్రఙ్గళ్ నఱ్కరుమఙ్గళై సాధనమాక చ్చొల్లియిరుక్కిన్ఱవే? - ఎన్ఱుమ్ శిలర్ కేట్టదుణ్డు. అవర్కళుక్కు చ్చొల్లుకిఱోమ్. - కడలిలే వలై వీశి, మీన్ ముదలియన పిడిత్తు జీవిప్పానొరు శెమ్బడవన్, ఒరునాళ్ విలైయుయర్న్ద రత్న మొన్ఱు మీన్కళిడైయే కడలిలే కిడక్క ప్పెఱ్ఱాన్. అదనుడైయ మతిప్పై అవన్ అఱియమాట్టాదవనా కయాలే "మామదియమ్ తిళైక్కుమ్ కొడిమాళికై శూళ్న్దెరువిఱ్పుఱుముత్తు వెణ్ణెఱ్కెనచ్చెన్ఱు మున్నిల్ వళైక్కై నుళైప్పావైయర్ మాఱు" (పెరియతిరు-3-8-7) ఎన్ఱు మాపోలే అన్ద రత్నత్తై క్కొణ్డుపోయ్ ఒరు వ్యాపారియిడత్తిలే స్వల్పవిలై కూఱి, విఱ్ఱువిట్టాన్. అన్ద వ్యాపారి రత్నత్తిన్ మదిప్పై నన్గుణర్న్దవనా కైయాలుమ్, వర్త్తకమే తొళిలాక జీవిప్పవనాకైయాలుమ్ అన్ద రత్నత్తై క్కొణ్డుపోయ్ ఒరు మహారాజనిడత్తిలే అదఱ్కుణ్డాన విలై కూఱి, ఆయిరమ్ వరాహత్తుక్కు విఱ్ఱాన్. పిఱకు, అన్ద మహారాజన్ అన్ద రత్నత్తై త్తాన్ విఱ్పనైచ్చెయ్య నినైయాదే, అదనై ప్పెరియదొరు హారత్తిలే ఇణైత్తు, స్వయంభోగ్యమాక పూణ్డుకొణ్డాన్, ఆక, ఇన్నదవడిక్కైయిల్ ఒరు రత్నత్తుక్కే మూన్ఱు తన్మైకళ్ ఉణ్డాయిన. 1. స్వల్పవిలైక్కు మాఱుదల్, 2. ఉళ్ళ విలైక్కు మాఱుదల్, 3. విలైక్కు ఆట్పడామల్ స్వయంభోగ్యమాక కొళ్ళప్పడుదల్-ఎన మూన్ఱు వకైకళ్ ఒరు వస్తువుక్కే అమైన్దాఱ్పోల, "అవియాద ఞానముమ్ వేళ్వియుమ్ నల్లఱముమ్" ఎన్ఱు ఇప్పాట్టిఱ్చొన్న భక్తి ముదలియవఱ్ఱుక్కుమ్ ఇఙ్గనే మూన్ఱు తన్మైకళ్ కూడుమ్. రత్నత్తిన్ మదిప్పై అఱియమాట్టాద నీశర్ అన్ద భక్తియైక్కొణ్డు ఐశ్వర్యమ్, కైవల్యమ్, ముదలియ అఱ్ప పలన్కళై కొళ్వర్. రత్నత్తై క్కుఱైన్ద విలైక్కు క్కొడాతే తకున్ద విలైక్కు క్కొడుత్త వ్యాపారియైప్పోన్ఱ అధికారికళ్, భక్తియై మోక్షసాధనమాక అభిమానిత్తు అఱ్పపలన్కళై క్కొళ్ళామల్, శిఱన్దదాన మోక్షఫలనై క్కొళ్వర్కళ్. రత్నత్తై ఒన్ఱుక్కుమ్ సాధన మాక్కాతే స్వయంభోగ్యమాక క్కొళ్ళుమ్ మహారాజనైప్పోన్ఱ విలక్షణాధికారికళ్,



భక్తియై ఒన్ఱుక్కుమ్ సాధనమాక క్కోలామల్ స్వయంపురుషార్థమాక క్కొణ్డు వర్త్తిప్పర్కళ్. మహారాజపదవియై విరుమ్బాదే వ్యాపారియిన్ నిలైమైయై విరుమ్బి భక్తియై సాధనమాక క్కొళ్ళుమవర్కళ్ అప్పడియే కొళ్క.

తోట్టమ్ శమైత్తు మామ్బళమ్ పయిర్శెయ్వార్కళిల్ అప్పళఙ్గళై అఱైకుఱై విలైక్కుమ్, అధికవిలైక్కుమ్ విఱ్పారుముణ్డు. విఱ్కాతే స్వయమ్ భోగ్యమాక భుజిప్పారు ముణ్డు. ఒరు మామ్బళన్దానే ఒరుత్తనుక్కు ఉపాయమాయుమ్, ఒరుత్తనుక్కు ఉపేయ మాయుమ్ ఆకానిన్ఱదు. విఱ్ఱు ఉపాయమాక క్కొళ్ళుమవన్ అధమనాకవుమ్, దరిద్రనాకవుమ్, విఱ్కాతే ఉపేయమాక క్కొళ్ళుమవన్ ఉత్తమనాకవుమ్, ఉయర్ శెల్వనాకవుమ్ పెయర్ పెఱువాన్. అదుపోల, భక్తిక్కు ఉపాయత్తన్మైయుమ్, ఉపేయత్తన్మైయుమ్ ఉణ్డాయిరుక్కచ్చెయ్దే ఉపేయత్తన్మైయై క్కొణ్డు. (అతావతు - అతనైయే ఫలనాక క్కొణ్డు) ఉత్తమాధికారికళిన్ తిరళిల్ పుకాతే, ఉపాయత్వాకారత్తై క్కొణ్డు కీళ్ వకుప్పిల్ పుక నినైప్పారై ఆర్కొల్ విలైక్కువార్?

"వనత్తిడరై ఏరియామ్ వణ్ణ మియఱ్ఱు మిదువల్లాల్, మారియార్ పెయ్కిఱ్పార్ మఱ్ఱు" ఎన్ఱ ఇరణ్డామ్ తిరువన్దాది ప్పాశురముమ్ నోక్కత్తక్కదు. మేట్టు నిలైఙ్గళై నామ్ పళ్ళమాక వెట్టివైప్పదు మళై పొళివదఱ్కు సాధనమన్ఱాకిలుమ్, ఎప్పోదేనుమ్ మళై పెయ్దాల్ అన్ద నీరై త్తాఙ్గిక్కొళ్వదఱ్కు ఉఱుప్పావదుపోల, నామ్ శెయ్యుమ్ నఱ్కిరిశైకళ్ భగవత్ప్రాప్తిక్కు సాధనమల్లవాకిలుమ్, ఎప్పోదేనుమ్ భగవానుడైయ అరుళ్ వెళ్ళమ్ నమ్మేల్ పెరుకప్పుక్కాల్, అదై త్తాఙ్గిక్కొళ్ళ నమదు నఱ్కిరిశైకళ్ ఉఱుప్పా యిరుక్కుమత్తనై.

ఇప్పాట్టిన్ ముదలడియిల్ ఇన్ద్రియఙ్గళ్ ఐన్దైయుమ్, ఇరణ్డామడియిల్ పంచభూతఙ్గళైయుమ్ శొల్లియిరుప్పదన్ కరుత్తావదు - ఇన్ద్రియఙ్గళోడు కూడినదాయ్, పఞ్చభూతఙ్గళాల్ ఇయన్ఱదాన శరీరత్తై చ్చొన్నపడి. శరీరత్తై మోక్షసాధనమాక ఆరుమ్ శొల్లవిల్లైయే? ఎన్నిల్, "అవియాద ఞానముమ్" ఎన్బదనాల్ శొల్లప్పట్ట భక్తిరూపాపన్న జ్ఞానమానతు కరణకళేబరసాధ్యమాకైయాలే కరణకళేబరఙ్గళుక్కుమ్ పరమ్పరయా మోక్షసాధనత్వమ్ శొల్లక్కూడుమెన్ఱుణర్క.

అగ్నిహోత్రమ్ ముదలియ వేళ్వికళుమ్, వివేకమ్, దయై, సత్యమ్-ముదలియ సద్గుణఙ్గళాకిఱ నల్లఱముమ్ సాక్షా న్మోక్షసాధనమాక క్కొళ్ళప్పడుకిన్ఱనవో? ఎన్నిల్, అవైయుమ్ భక్తి ఉణ్డాకి వళర్వదఱ్కు క్కారణఙ్గళాక శాస్త్రఙ్గళిల్ శొల్లప్పడుకైయాలే అవఱ్ఱుక్కుమ్ పరమ్పరయా మోక్షసాధనత్వమే శొల్లక్కూడుమ్.

ఆకవే, ఇప్పాట్టిల్ "అవియాద ఞాన" మెన్ఱు శొల్లప్పట్ట భక్తి ఒన్ఱే మోక్షోపాయ మాక వళఙ్గక్కూడియదు. ఎమ్బెరుమానుక్కే నిరపేక్ష ఉపాయత్వమ్ కొళ్ళుకిఱ ఆళ్వార్ తిరువుళ్ళత్తాలే అన్ద భక్తి యుపాయత్వముమ్ కళిక్కప్పడుకిన్ఱదు. "ఎన్బరే!" ఎన్ఱ ఏకారమ్

**ఇదనై క్కాట్టుమ్. ఇని, "ఎన్బరే" ఎన్గవిడత్తు ఏకారత్తై అశైయాక క్కొణ్డు, "భగవత్ప్రాప్తిక్కు భక్తియై ఉపాయమెన్బర్" ఎన్ఱు శొల్లివిడువతాక ఉరైప్పారుముణ్డు. ఉయల్వు – ఉపాయమ్.**

**దివ్యార్థ అను :– (శెవి వాయ్ కణ్)** – "మనకు ఉపాయం, ఉపేయంకూడా భగవానుడే" అనే శాస్త్రార్థం చాలామందికి తెలిసినా, భక్తి మొదలైనవానినికూడా భగవానుని పొందడానికి ఉపాయంగా కొందఱు భ్రమిస్తారు. అయ్యో! ఈ విధంగా కొందఱు మహానుభావులుకూడ భ్రమిస్తున్నారే! అని ఆళ్వార్లు జాలిపడుతున్నారు ఈ పాశురంలో. ఆపత్తు ఎదురైనపుడు తానే వచ్చి కాపాడేవాడుకదా భగవానుడు – అని పలుకదలచి పాశురంలో **"ఏనమాయ్ నిన్ఱార్క్కు"** అని అన్నారు. **"మాశుడమ్బిల్ నీర్వారా మానమిలా ప్పన్ఱి"** యై అవతరించి, అరుదైన చేష్టలను చేసినది అంతా తన నిర్హేతుకకృపతో తప్ప, వేఱే ఉపాయాన్ని ఎదురు చూచి కాదుకదా! అని సూచించినట్లయింది.

భగవానుడు ఎల్లప్పుడు మనకు మంచిని చేయడానికే సమయంకోసం ఎదురుచూస్తూ ఉంటాడు. అతని ప్రయత్నాన్ని మనం అడ్డుపెట్టి, తొలగ ద్రోసేటపుడు "అయ్యో! నా కృషి ఫలించలేదే!" అని మనస్సులో నొచ్చుకుంటాడు. ఎపుడు మనం అడ్డుకోకుండా ఉండి, "అతడు చేసే పనిని చేసికోనీ!" అనే తటస్థంగా ఊరికే ఉంటామో, ఆ సమయాన్నే ఆధారంగా చేసికొని, "నా ఊరును చెప్పావు, నా పేరును చెప్పావు, నా భక్తులను రక్షించావు, వారి దాహాన్ని తీర్చావు, వారికి విశ్రమించడానికి నీడ ఇచ్చావు" అన్నట్లు కొన్నింటిని ఆరోపించి, తెలియకుండా, "మన ఒడిలో మామిడికాయను పెట్టినట్లు" బంగారువర్తకుడు బంగారాన్ని గీటురాయిపై గీచి, ఆ బంగారం రేణువులను మైనంతో ఎత్తి సేకరించి "కాసులో నాల్గవభాగం బంగారం అయింది" కాసు బంగారం అయింది," అని ఏర్చి కూర్చినట్లు, యాదృచ్ఛికం, ప్రాసంగికం, ఆనుషంగికం – అనే సుకృతవిశేషాలను తానే కల్పించుకుంటూ, తానే వాటిని ఒకటికి పదిగా చేసి, ప్రవర్తింపజేస్తూ (మంచిని) హితాన్ని అనుగ్రహిస్తాడు. ఇటువంటి భగవానుడే తనను ఆశ్రయించే దారి అనుగ్రహిస్తాడు. అతనిని మనం పొందాలి తప్ప, మనం ఒక ఉపాయానుష్ఠానం చేసి, అతనిని పొందుతా మనేది ఏ సమయంలోను మనకు వీలు కాదు.

అతనికి శేషమై ఉన్న మనం, సర్వశేషి అయిన అతని కృపను ఉపాయానుష్ఠానా లతో బలాత్కారంగా పొందుదామనేది మన స్వరూపానికి తగినది కాదు. అందువల్ల, ఆళ్వార్లు వేఱొక ఉపేయాన్ని తెలియని రీతిలోనే, వేఱొక ఉపాయాన్నికూడా తెలియకుండానే ఉంటారు. **"ఆఱెనక్కు నిన్ పాదమే శరణాక త్తన్దొழిన్దాయ్"** (నీ పాదాన్నే శరణంగా అంటే ఉపాయంగా–నాకు నీవు అనుగ్రహించావు) అని అంటారు. ఈ సిద్ధాంతానికి మాఱుగా "కర్మజ్ఞానాలతో నిర్మలమైన మనస్సును కలవానిచేత చేయబడేది, తైలధారవలె అవిచ్ఛిన్నమైన, ధ్యానపరంపరారూపం అయిన భక్తియే ఉపాయం" అని



వైదికులు పలుకుతున్నారే! ఇది ఏం అజ్ఞానమో! – అనే రీతిలో భగవానుని ఉపాయత్వాన్ని ద్రఢీకరిస్తున్నారు.

"మనం చేసే సత్కార్యాలు భగవానుని పొందడానికి ఉపాయం కాదు – అని చెప్పినట్లయితే, మనం ఏ ఒక్కటినీ చేయకుండానే ఉండవచ్చును కదా! శాస్త్రాలు సత్కర్మలను సాధనాలుగా చెబుతున్నవే!" అని కొందఱు అడుగుతారు. వారికి సమాధానంగా చెబుతున్నాము. "సముద్రంలో వలను విసరి చేపలు మొదలైనవానిని పట్టి జీవించే జాలరివాడొకడు ఒకనాడు గొప్ప విలువైన రత్నాన్ని చేపల వలతో సముద్రంలో పట్టుకున్నాడు, దాని విలువను అతడు తెలిసికోలేనివాడు కావడం వల్ల మా **"మదియమ్ తిళైక్కుమ్ కొడిమాళిక్కై శూழ్న్దెరువిల్ శెழுముత్తు వెణ్ణెక్కెనచ్చెన్ఱు మున్నిల్ వళైక్కై నుళైప్పావైయర్మాఱు"** అన్నట్లు ఆ రత్నాన్ని తీసికొనిపోయి, ఒక వ్యాపారి దగ్గఱ స్వల్ప మూల్యాన్ని చెప్పి, అమ్మివేశాడు. ఆ వ్యాపారి రత్నం విలువను బాగా తెలిసినవాడు కావడంచేత, వర్తకమే వృత్తిగా జీవించేవాడు కావడంచేత, ఆ రత్నాన్ని తీసికొనిపోయి ఒక మహారాజు దగ్గర దానికున్న వెలను చెప్పి, వేయి వరహాలకు అమ్మి వేశాడు. తర్వాత ఆ మహారాజు ఆ రత్నాన్ని తాను అమ్మివేయాలని అనుకోకుండా, దాన్ని ఒక పెద్ద హారంలో పొదిగించి, స్వయంభోగ్యంగా ధరించాడు. ఈ విధంగా ఉన్న మూల్యానికి ఈ నడవడికలో ఒక రత్నానికే మూడు స్వభావాలు ఉన్నవి. 1.అల్ప మూల్యానికి అమ్ముడుపోవడం, 2. సరి అయిన వెలకు అమ్మబడడం, 3. వెలకు అమ్మబడ కుండా స్వయం భోగ్యంగా గ్రహింపబడడం – అనే మూడు రీతులు ఒకే వస్తువుకు ఏర్పడినట్లే, **"అవియాత ఞానముమ్ వేళ్వియుమ్ నల్లఱముమ్"** అని ఈ పాశురంలో పల్కిన భక్తి– మొదలైన వానికిని. ఈ విధంగా మూడు స్వభావాలు తగును. జాలరివానివలె భక్తి – గొప్పతనాన్ని తెలియలేని నీచులు ఆ భక్తితో ఐశ్వర్యం, కైవల్యం మొదలైన అల్పఫలాలను పొందేవారు. రత్నాన్ని తక్కువవెలకు ఇవ్వకుండా తగిన వెలకు ఇచ్చిన వ్యాపారివంటి అధికారులు–భక్తిని మోక్షసాధనంగా అభిమానించి, అల్పఫలాలను గ్రహించకుండా, గొప్పదైన మోక్షఫలాన్ని పొందేవారు. రత్నాన్ని దేనికి సాధనంగా చేయకుండా స్వయం భోగ్యం గ్రహించే మహారాజు వంటి విలక్షణాధికారులు – భక్తిని దేనికి సాధనంగా కోఱకుండా స్వయంపురుషార్థంగా భావించి వర్తించేవారు. మహారాజ పదవిని కోరకుండా, వ్యాపారి స్థితిని ఆశించి, భక్తిని సాధనంగా గ్రహించేవారు అటువంటి వారేనని గ్రహించాలి.

తోటను పెంచి, మామిడిపండ్లను పైరు చేసేవారిలో కొందఱు ఆ పండ్లను అఱకొఱ వెలకు, అధిక వెలకును అమ్మేవారు ఉన్నారు. అమ్మకుండా స్వయంభోగ్యంగా భుజించేవారూ ఉన్నారు. ఒక మామిడిపండే ఒకరికి ఉపాయంగాను, వేఱొకరికి ఉపేయం

గాను అవుతున్నది. అమ్మి, ఉపాయంగా గ్రహించేవాడు – అధముడుగాను, దరిద్రుడుగాను, అమ్మకుండా ఉపేయంగా గ్రహించేవాడు – ఉత్తముడుగాను, గొప్ప ధనవంతుడుగాను పేరు పొందుతాడు. ఆవిధంగానే, భక్తికి ఉపాయస్వభావం, ఉపేయస్వభావం–రెండూ ఉన్నపుడు, ఉపేయస్వభావాన్ని గ్రహించి (అంటే – దాన్ని ఫలంగా గ్రహించి) ఉత్తమాధికారుల గోష్ఠిలో ప్రవేశించకుండా, ఉపాయత్వాకారాన్ని గ్రహించి తక్కువ వరుసలోనికి పోవాలని తలచేవారిని ఎవరు అడ్డుకోగలరు?

**"వనత్తిడరై ఏరియామ్ వణ్ణ మియగ్ఱ్రు మిదువల్లాల్ మారియార్ పెయ్‌కిఱ్పార్ మగ్ఱ్రు"** అనే ఇరణ్డామ్ తిరువన్దాదిలోని పాశురం గమనించతగినది. మెట్టప్రదేశాలను మనం పల్లంగా త్రవ్వివేయడం వర్షం కురవడానికి సాధనం కాకపోయినా, ఎపుడైనా వర్షం కురిస్తే ఆ నీరు నిలువడానికి ఉపయోగపడినట్లే, మనం చేసే సత్కర్మలు భగవత్ప్రాప్తికి సాధనాలు కాకపోయినా, ఎపుడైనా భగవానుని కృప మనపై ప్రవహించడం ప్రారంభిస్తే దాన్ని ధరించడానికి మనకు సత్కర్మలు సాధనంగా అవుతాయి, అంతే.

ఈ పాశురంలోని మొదటి పాదంలో అయిదు ఇంద్రియాలను రెండవ పాదంలో అయిదు భూతాలను పల్కడంలో అభిప్రాయం ఏమంటే, ఇంద్రియాలతో కూడినది, పంచభూతాలతో నిర్మింపబడ్డది అయిన శరీరాన్ని చెప్పడమే. శరీరాన్ని మోక్షసాధనంగా ఎవరు చెప్పలేదే! అంటే, **"అవియాత ఞానముమ్"** అనడంద్వారా చెప్పబడ్డ భక్తిరూపాపన్న జ్ఞానం కరణకళేబరసాధనం కావడంవల్ల, కరణకళేబరాలకుకూడా పరంపరయా మోక్షసాధనత్వం చెప్పడం తగును – అని గ్రహించాలి.

అగ్నిహోత్రం మొదలైన **"వేళ్వి"** (యాగాలు) కూడా వివేకం, దయ, సత్యం మొదలైన **"నల్లఱమ్"**–సాక్షాన్మోక్ష సాధనాలుగా గ్రహింపబడుతున్నాయా? అంటే, అవికూడా భక్తిని కల్గించి, వృద్ధిచేయడానికి కారణాలుగా శాస్త్రాలలో చెప్పబడడంవల్ల వానికి పరంపరయా మోక్షసాధనత్వమే చెప్పడం తగును.

అందువల్ల ఈ పాశురంలో **"అవియాత ఞానమ్"** అని చెప్పబడ్డ భక్తి ఒక్కటే మోక్షోపాయంగా చెప్పతగినది. భగవానునకు మాత్రమే నిరపేక్షోపాయత్వం గ్రహించే ఆళ్వార్ల అభిప్రాయంలో ఆ భక్తికి గల ఉపాయత్వం నిరసింపబడుతున్నది. **"ఎన్బరే!"** అన్నపుడు ఏకారం దీన్ని చూపుతుంది. ఇక, **"ఎన్బరే"** అన్నపుడు ఏకారాన్ని నిశ్చయాత్మకంగ గ్రహించి, "భగవత్ప్రాప్తికి భక్తియే ఉపాయమని అంటారు" అని చెప్పినట్లు వివరించేవారూ ఉన్నారు. **"ఇయల్వు"** – ఉపాయం.

**(13) ఇయల్వాక వీన్ తుழாయానడిక్కే శెల్ల,**
**ముయల్వారియలమరర్ మున్నమ్, – ఇయల్వాక**



**నీదియా లోది నియమఙ్గళాల్ పరవ,**
**ఆదియాయ్ నిన్ఱారవర్**

మున్నమ్ = అనాదికాలముగా, ఇయల్ అమరర్ = యెగ్యతను కల నిత్యసూరులు, ఈన్ తుழாయాన్ అడిక్కే శెల్ల = అందమైన తులసిని అలంకరించుకొనిన పురుషోత్తముని శ్రీపాదములలో చేరుటకు, ఇయల్వాక = తగినట్లు, ముయల్వార్ = ప్రయత్నించువారు, ఇయల్వాక = (మిగిలినవారికిని) తగినట్లు, నీదియాల్ ఓది = క్రమానుసారము తిరునామములను పల్కి, నియమఙ్గళాల్ పరవ = శాస్త్రనియములతో పొగడునట్లు, అవర్ = ఆ స్వామి, ఆది ఆయ్ నిన్ఱార్ = (చేతనుని విషయాకరించుటలో) మొదటివారై యున్నారు.

**అవతారిక :–** భగవానుని యథాతథముగా తెలిసికొని అనుభవించుటకు అధికారులు నిత్యసూరులు. **"వాయవనై యల్లదు వాழ్త్తాదు"** అను మీరును కావచ్చును. సామాన్యులగు సంసారులు మిక్కిలి గొప్పవాడగు అతనిని ఎట్లు ఆశ్రయించుట? అనినచో, వారును అతనిని ఆశ్రయించునట్లు తానే ముందుకు వచ్చును – అని ఇందు పల్కుచున్నారు. అనుభవించుటకు ఉపకరణములను ఇచ్చి, రుచిని కల్గించి, తానే ఉపాయమై, ఫలమును కూడ అతడు  తానే ఇచ్చును – అనుచున్నారు.

**వ్యాఖ్య:– (ఈన్తుழாయానడిక్కే శెల్ల)** – చక్రవర్తులు పూమాలలను ధరించియుందురు కదా! ఉభయవిభూతికిని ఏకైకచక్రవర్తి తానే అనుటను తెలుపు భోగ్యమైన తులసిని తోమాలగా గల సర్వేశ్వరుని శ్రీపాదములను పొందుటకు– అని (దీని) భావము.

**(ఇయల్వాక)** – సహజముగానే జ్ఞానమును కల నిత్యసూరులు.

**(మున్నమ్ ఇయల్వాక ముయల్వార్)** – తామే ప్రయత్నించి అతని గొప్పతనమునకు తగినట్లు గొప్ప ప్రయత్నమును చేయుదురు. **"శూట్టు నన్మాలై తూయన వేన్ది... నన్నీర్ ఆట్టి అన్దూపమ్ తరా"** అనునట్లు పవిత్రములగు పూమాలికలను సమర్పించి, పరిశుద్ధజలమును సమర్పించి, అందమైన ధూపమును వేసి, సేవ చేయుదురు.

**(ఇయల్వాక)** – ఇదియే జీవనయాత్రగానుందురు – అనియును భావము.

**(మున్నమ్ ఇయలమరర్)** – అనాదికాలముగా సహజమైన జ్ఞానమును కల నిత్యసూరులు– అనియును భావము. సహజముగానే జ్ఞానమును కల నిత్యసూరులు అట్లుండుటలో లోపము లేదు. సంసారులు మిక్కిలి గొప్పవాడగు అతనిని పొందుట ఎట్లు? అనినచో, వాని విషయములో ఇతడే ముందుకు వచ్చును – అనుచున్నారు.

**(ఇయల్వాక)** – తమ శక్తికి తగినట్లు. **"మంత్రో హీనః స్వరతో వర్ణతో వా...యజమానం హినస్తి** (పాణినిశిక్షా) (స్వరముచే గాని, వర్ణముచే గాని, హీనమగు

మంత్రము వక్తను వధించును) అను రీతిలో స్వరము, వర్ణము మొదలగువానిలో లోపములేనట్లు అందముగా స్తుతించుటకు – అనియును అర్థము.

**(నీదియాల్ ఓది)** – శాస్త్రములలో చెప్పిన వ్రతనియమాది ప్రయత్నములు తప్పకుండునట్లు అధ్యయనము చేసి,

**(నియమఙ్గళాల్ పరవ)** అధ్యయనము చేసిన వేదముయొక్క అంతరార్థమును ఆచార్యుల సన్నిధిలో వినుట. దానిని మననముచేయుట, అర్చించుట, నమస్కరించుట, నామ సంకీర్తనము చేయుట, భగవద్భాగవతపాదసేవను చేయుట – మొదలగువానితో అతనిని ఎల్లప్పుడు ధ్యానించుట అనెడి నియమముతో భక్తిపరవశులై స్తుతించునట్లు. **(పరవ)** ఇచట స్తుతించుట అనునది. మనోవాక్కాయములు మూడింటితో ఆశ్రయించుటకు ఉపలక్షణము.

**(పరవ ఆదియాయ్ నిన్షార్ అవర్)** – నిత్యసూరులును గొప్ప ప్రయత్నమును చేసి, ఆశ్రయింపవలసిన మిక్కిలి గొప్పవాడు. సంసారులమగు మనబోటివారును ఆశ్రయించునట్లు ముందుకు వచ్చును. **"పూర్వో యో దేవేభ్యో జాతః"** (పు.సూ) – (ఎవడు దేవతల కొఱకు ముందుగా జనించెనో), **"మహాపురుష! పూర్వజ!"** (జితంతే1-1) (మహాపురుషా! ముందుగా పుట్టువాడా!) అనునట్లు, తానే ముందుకువచ్చి **"ఉయరళిప్పాన్ ఎన్నిన్ష యోనియుమాయ్ ప్పిఱన్దాయ్"** అనునట్లు చేతనరక్షణార్థము ఎన్ని జాతులలోనో అవతరించి, మానవులుకొఱకు పడరాని పాట్లు పడి, వారికి ప్రథమసుకృతములను కలుగజేసి, తన పట్ల రుచిని కల్గించి, అనుభవించుటకు ఉపకరణములను ఇచ్చి, ఉపాయమై నిలిచి, ఫలమును ఇచ్చును. అందుచే మనకు ఆశ్రయించుటలో లోపము లేదు – అని పల్కుచున్నారు.

పెరియ :– **పతిన్ మూన్ఱామ్బాట్టు – (ఇయల్వాక) "వా యవనై యల్లతు వాళ్త్తాతు" ఎన్నుమ్బడియా యిరున్దతు, ఉమ్మతు. అల్లాతార్క్కు అవనై యాశ్రయిరుక్కుమ్బోతు అవధానమ్ వేణుమ్. ఎఙ్గనే కూడుమ్బడి? ఎన్నిల్, ప్రకృత్యా ఆశ్రయిత్తిరుప్పర్కళ్ నిత్యసూరికళ్; అల్లాతారుమ్ ఆశ్రయిక్కుమ్బడి తానే ప్రథమభావియామ్ ఎన్గిఱార్.**

**(ఇయల్వాక) సదృశమాక.**

**(ఈన్తుఱాయా నడిక్కే శెల్ల) ఆకముతలియాక త్తోళ్మాలై యిట్టిరుక్కిఱవతుక్కు ప్పోరుమ్బడియాక.**

**(ముయల్వారియలమరర్ మున్నమ్) ఇయర్గ్రియై యుడైయరాన నిత్యసూరికళ్ మున్నే మహాయత్నమ్ పణ్ణువర్కళ్. విషయప్రవణరాయ్ అవనై అతియాతవర్కళుమ్.**



**(ఇయల్వాక) సదృశమాక.**

**(నీతియాలోతి) ముఱైయాలే తిరునామఙ్గళై చ్చొల్లి.**

**(నియమఙ్గళాల్ పరవ) పరవుమ్బడిక్కీడాక. శాస్త్రఙ్గళిల్ శొల్లుకిఱ నియమఙ్గళాలే పరవశరాయ్ ప్పరవుమ్బడి క్కీడాక.**

**(అవర్ ఆతియాయ్ నిన్షార్) అవర్తామే ప్రథమ సుకృతమానార్.**

**అవ – ఉపకరణఙ్గళైయు జ్గొడుత్తు, రుచియైయుమ్ జనిప్పిత్తు, ఉపాయముమాయ్, తానే ఫలప్రదానమ్ పణ్ణు మెన్గిఱార్.**

**(ఇయలమరర్) ఇయర్గ్రియైయుడైయ అమరర్.**

**(మున్నమ్) మున్దుఱ మున్నమ్.**

**(ఇయల్వాక) ఇతువే యాత్రైయాక.**

**(ఈన్తుఱాయాన్) పరిపూర్ణన్.**

**(అడిక్కే శెల్ల) తిరువడికళుక్కే శేర.**

**(ముయల్వార్) యత్నమ్ పణ్ణువార్.**

**(ఇయల్వాక) సదృశమాక.**

**(నీతియా లోతి) శాస్త్రోక్తమానపడియే.**

**(నియమఙ్గళ్) శ్రవణాదికళ్.**

**(పరవ) ఆశ్రయిత్తు.**

**(ఆతియాయ్ నిన్షార్) అవర్కళుక్కు ఉపేయత్తుక్కు అడియానాప్పోలే, వేణ్డిన విడత్తుక్కు ఇవర్కళుక్కు ఉపాయత్తుక్కడియాయ్ నిన్షాలాశ్రయిక్కవొణ్ణాతో? అవనే ఇతుక్కుమ్ వేణ్డిన పిన్బు అవనైయే పగ్రిరవమైయాతో? ఎన్నుమామ్.**

**అరు :– పతిన్ మూన్ఱామ్బాట్టు. ఉమక్కు అవధానమ్ వేణ్డాతపడి ఇన్ద్రియఙ్గళ్తానే పగ్రిగ్రిఱు, అల్లాతార్క్కు అవధానమ్ కూడుమ్బడి ఎన్? ఎన్ను శఙ్కాభిప్రాయమ్. ప్రథమ భావి – ప్రథమసుహృత్తు. ఆక – సదృశమాక ఎన్గత్తాల్ ఎన్ను ఫలితమ్. ఇత్తై అరుళిచ్చెయ్ కిఱార్ (ముతలియాక త్తోళ్ మాలై యిత్యాది) (అడిక్కే శెల్ల) తిరువడిక్కు, శేర ఎన్గతు – తకుతియాక. తిరుమేనిక్కు ప్పాఙ్గాన అడిమైకళై పణ్ణి – ఎన్గపడి. అప్పోతు, సదృశమాక ఎన్గతు తఙ్గళ్ స్వరూపత్తుక్కు సదృశమాక. "నీతియాలోతి" ఎన్గైయాలే – ఓతుకిఱ సంసారికళ్ అధ్యాహార్యమ్.**

మేల్ యోజనైక్కు అవతారికై యరుళిచ్చెయ్‌కిఱార్ (ఉపకరణఙ్గళైయు మిత్యాది) అవర్‌కళుక్కు – నిత్యసూరికళుక్కు. "నీతియా లోతి" ఎన్గిఱ ఉపాసనత్తుక్కు అవనై క్కొణ్డు సాధిక్కవేణ్డినాల్ అత్తై విట్టు అవన్దన్నైయే పఱ్ఱ అమైయాతో? ఎన్గిఱార్. (అవనే యితుక్కుమిత్యాది).

*నమ్బిళ్ళై :– పదిన్ మూన్ఱామ్ పాట్టు:– "వా యవనైయల్లతు వాళ్త్తాదు" ఎన్నుమ్బడియా యిరున్దదు ఉమ్మదు. అల్లాదార్‌క్కు అవనై ఆశ్రయిక్కుమ్బోదు అపదానమ్ వేణుమ్. ఎఙ్గనే కూడుమో? ఎన్నిల్, ప్రకృత్యా ఆశ్రయిత్తిరుక్కిఱవర్‌కళ్ నిత్యసూరికళ్. అల్లాదారుమ్ యథాశక్తి ఆశ్రయిక్కుమ్బడిక్కీడాక త్తానే ప్రథమభావియామ్ – ఎన్గిఱదు.*

*(ఇయల్వాక ఇత్యాది) అవనుక్కు సదృశమాక పరిమాఱవల్లార్ నిత్యర్‌కళన్ఱో! ఎన్గిఱార్. ఇయల్వాక – సదృశమాక – ఎన్నుదల్. స్వభావమాక్కి ఇదువే యాత్రైయాక ఎన్నుదల్. కర్మమడియాక ఒరు శరీరపరిగ్రహమ్ పణ్ణి, చ్చిలనాళ్ వేఱే శిల విషయఙ్గళిలే ప్రవణనాయ్ ప్పిన్బొరు సుకృతమడియాక భగవద్విషయత్తిలే కైవైత్తవర్‌కళన్ఱిక్కే, ఇవ్విషయత్తిల్ పరిమాఱ్ఱమ్ సత్తాప్రయుక్తమ్ – ఎన్దపడి.*

*(ఈన్తుళాయాన్) ఐశ్వర్యసూచకమాయిరుక్కై. ఆక, ముదలియాక తోళ్‌మాలై ఇట్టిరుక్కిఱవనుక్కు .*

*(అడిక్కే శెల్ల) – తిరువడికళిలే కిట్ట. "భావజ్ఞేన" ఎన్నుమ్బడి అవన్ తిరువుళ్ళత్తిలే పడుమ్బడి.*

*(ముయల్వార్ ఇయల్ అమరర్ మున్నమ్) – మున్దుఱ మున్నమ్ అవన్ తిరువడి కళుక్కు ఈడాక ప్పరిమాఱువర్ ఇయఱ్ఱియై ఉడైయ నిత్యసూరికళ్. "అహం సర్వం కరిష్యామి" పణ్ణుకై. విషయప్రవణరాయ్, అవనై అఱియాదవర్‌కళుమ్.*

*(ఇయల్వాక) ఆకిల్, అవర్‌కళే ఆశ్రయిత్తు ప్పోమిత్తనైయో? ఎన్నిల్, నమక్కుమెల్లామ్ ఆశ్రయిత్తోమాకలామ్బడి అవన్ తానే పణ్ణిత్తరుమ్ – ఎన్గిఱార్.*

*(ఇయల్వాక) సదృశమాక, అళ్కితాక. శాస్త్రోక్తమాన పడియే తిరునామఙ్గళై చ్చొల్లి, వ్రతనియమాదికర్మఙ్గళోడే అధ్యయనత్తై ప్పణ్ణి.*

*(నియమఙ్గళాల్ పరవ) – శాస్త్రఙ్గళిల్చొల్లుకిఱ శ్రవణాదికళాలే పరవశరాయ్ ప్పోకుమ్బడిక్కీడాక.*

*(ఆదియాయ్ నిన్ఱార్ అవర్) – ముఱ్పాదనుమాయ్, రుచిజనకనుమాయ్, ఉపకరణఙ్గళైయుమ్ కొడుత్తు ప్రవృత్తనుమాయ్, ఫలప్రదనుమాయ్, ప్రాప్యనుమాయ్ నిన్దపిన్బు, నమక్కుమెల్లామ్ ఒరు కుఱై యిల్లై – ఎన్గిఱార్. "అహం హి సర్వయజ్ఞానాం*



*భోక్తా చ ప్రభు రేవ చ", "అహం సర్వస్య ప్రభవో మత్త స్సర్వం ప్రవర్తతే". సూరికళోడు, ఇవర్‌కళోడు వాశియిల్లైక్కు, కుదల్‌తుడక్కు*

అప్పిళ్ళై :– అవ :– పతిన్‌మూన్ఱా మ్బాట్టు. అవనై నేర్‌కొడునేరే కిట్టి ప్పరిమాఱుకైక్కు అధికారికళ్ నిత్యసూరికళే. ఇప్పడి యిరుక్కచ్చెయ్‌తేయుమ్ సంసారికళాన నమ్బోల్వార్‌క్కుమ్ ఆశ్రయిక్కలామ్బడియాక త్తన్నై సులభనాక్కివైక్కు మెన్గిఱార్.

ఈన్ :– ఐశ్వర్య సూచకమాయ్, అళ్కియ, తుళాయాన్ – తిరుత్తుళాయై యుడైయనాన సర్వేశ్వరనుడైయ, అడిక్కే – తిరువడికళిలే, శెల్ల – కిట్ట, ఇయల్వాక – అతుక్కీడాన యోగ్యతై యుడైయరాన, అమరర్ – నిత్యసూరికళ్, ఇయల్వాక – అల్లాత నమ్బోల్వారుమ్ స్వరవర్ణాదికళుక్కు నళువుతల్ వారాతపడి అళ్కితాక క్కొణ్డు, నీతియాల్– శాస్త్రోక్తమాన వృత్తినియమాదిక్రమఙ్గళోడే, ఓతి – అధ్యయనత్తై ప్పణ్ణి. నియమఙ్గళాల్– అధీతమాన వేదత్తి నర్థత్తై ఆచార్యన్‌పక్కలిలే కేట్టు మననమ్ పణ్ణి, అర్చనప్రణామకీర్తనాది కళోడేకూడ అనవరతభావనై పణ్ణుకైయాకిఱ నియమఙ్గళాలే, పరవ – భక్తిపరవశమాయ్ ప్పరవుమ్బడి క్కీడాక, అవర్ – అప్పడిప్పట్ట పెరుమైయై యుడైయరానవవర్, అతియాయ్– "పూర్వజ" ఎన్గిఱపడియే రుచ్యుత్పాదకరాయ్ క్కొణ్డు ముఱ్పాదరాయ్ నిన్ఱార్. అకైయాలే, నమక్కెల్లామ్ ఆశ్రయిక్కైక్కు కుఱైయిల్లై ఎన్దు కరుత్తు. (ఇయలమరర్) ఇయల్ – ఇయఱ్ఱి, యోగ్యతైయైయుడైయ నిత్యసూరికళ్ ఎన్దపడి.

దివ్యార్థ :– (ఇయల్వాక) – ఎమ్బెరుమాన్ తిరువడికళిలే నిత్యకైంకర్యమ్ శెయ్‌వదఱ్కు త్తక్క యోగ్యత్తై యుడైయవర్‌కళ్ నిత్యసూరికళేయన్ఱో! సంసారికళాన నమక్కెల్లామ్ అప్పెరుమానై ప్పణిన్దు ఉయ్‌దఱ్కు ఉరియ విరకు ఉణ్డో! ఎన్దు ఒరు శఙ్కై ఉదిక్కక్కూడుమే! అదఱ్కు ఉత్తరమాక అవతరిత్త పాశురమ్, ఇదు. నిత్యసూరికళ్ తామ్ ఎమ్బెరుమాన్ తిరువడికళిలే ఆళ్న్దిరుప్పర్. ఇరుక్కట్టుమ్. సంసారికళుక్కు భగవత్సమాశ్రయణ యోగ్యతైయే కిడైయాదెన్దుకొళ్ళ ఇడ మిల్లై. సంసారికళుమ్ వేదఙ్గళై యోది అవఱ్ఱిన్ పొరుళ్‌కళై త్తెరిన్దుకొణ్డు, పడిప్పడియాక త్తిరున్ది ఎమ్బెరుమానై వన్దు కిట్టుమ్బడియాక అప్పెరుమాన్ తానే మూలసుకృతమాన అమైన్దిరానిన్ఱా ఎన్గిఱార్.

ఇప్పడి యరుళిచ్చెయ్‌వదన్ కరుత్తు యాదు ఎన్నిల్ – ఎమ్బెరుమాన్ అడైవదాకిఱ కారియమ్ చేతనరుడైయ నిలైయిలే కిడప్పదన్దు, "ఎదిర్ శూళ్ల్ పుక్కు ఎనైత్తోర్ పిఱప్పుమ్ ఎనక్కే అరుళ్‌కళ్ శెయ్య, విదిశూళ్న్దదాల్ ఎనక్కే లెమ్మాన్ తిరివిక్కిరమనైయే" – **(తిరువాయ్–2–7–6)** ఎన్గిఱపడియే నెడునాళే పిడిత్తు సంసారియై ప్పెఱువదఱ్కు అప్పెరుమాన్ తానే పలవకై యాన కృషికళై పణ్ణిక్కొణ్డిరుక్కిఱాన్ – ఎన్దవాఱు. "ఆదియాయ్ నిన్ఱారవర్" ఎన్దదన్ కరుత్తు ఇదువే. శ్రీవేదాన్తదేశికనుమ్ ఇదనైయే

**తిరువుళ్ళమ్ పఱ్ఱిగ్రీ శ్రీరహస్యత్రయసారత్తిలే "నిదానం తత్రాపి స్వయ మఖిలనిర్మాణ నిపుణః" ఎన్ఱరుళిచ్చెయ్‌దార్ ఎన్ఱు కాణ్గ.**

**దివ్యార్థ :- అను :- (ఇయల్వాక)** – భగవానుని శ్రీపాదాలలో నిత్యకైంకర్యాన్ని చేయడానికి తగిన యోగ్యతను కలవారు నిత్యసూరులే కదా! సంసారులమైన మనకంతా ఆ స్వామిని ఆశ్రయించి, తరించడానికి తగిన ఉపాయం ఉన్నదా? అనే ఒక సందేహం కలుగవచ్చును కదా! దానికి సమాధానంగా అవతరించిన పాశురం,ఇది. నిత్యసూరులు తాము భగవానుని శ్రీపాదాలలో నిమగ్నులై ఉంటారు. ఉండనివ్వండి. సంసారులకు భగవత్సమాశ్రయణ యోగ్యతయే లేదని చెప్పే అవకాశం లేదు. సంసారులుకూడా వేదాలను అభ్యసించి, వాటి అర్థాలను తెలిసికొని, క్రమక్రమంగా మాఱి భగవానుని చేరి ఆశ్రయించేటట్లు ఆ భగవానుడే మూలసుకృతంగా అమరియున్నాడని (ఆళ్వార్లు) అంటున్నారు.

ఈ విధంగా అనుగ్రహించడంలో ఉద్దేశ్యం ఏమంటే – భగవానుని పొందడం అనే కార్యం చేతనుల తలపై ఉండేది కాదు. **"ఎదిర్ శూழల్ పుక్కు ఎనక్కోర్ పిఱప్పుమ్ ఎనక్కే అరుళ్‌కళ్ శెయ్య, విదిశూழ్న్దదాల్ ఎనక్కేలెమ్మాన్ తిరివిక్కిరమనైయే"** అన్నట్లు చిరకాలంగా సంసారిని పొందడానికి ఆ భగవానుడే పలు విధాలైన కృషులను చేస్తున్నాడు– అని భావం. **"ఆదియాయ్ నిన్ఱారవర్"** అనేదాని భావం ఇదే. శ్రీవేదాంతదేశికులుకూడా దీన్ని దృష్టిలో ఉంచుకొని శ్రీరహస్యత్రయసారంలో **"నిదానం తత్రాపి స్వయ మఖిల నిర్మాణనిపుణః"** అని అనుగ్రహించారని తెలియాలి.

**14) అవరవర్ తాన్దా మఱిన్దవాఱేత్తి,**
**ఇవరివరెమ్బెరుమా నెన్ఱు, – శువర్‌మిశై**
**చ్చార్త్తియుమ్ వైత్తుమ్ తొழువర్, ఉలకళన్ద**
**మూర్‌త్తియురువే ముదల్**

అవర్ అవర్ = రజోగుణమును, తమోగుణమునుకల కొందఱు, తామ్ తామ్ అఱిన్ద వాఱు = తమ గుణములకు తగినట్లు తాము తెలిసినవిధముగా, ఇవర్ ఇవర్ ఎమ్బెరుమాన్ ఎన్ఱు ఏత్తి = "వీరు మనకు స్వాములు" అని (కొందఱు దేవతాంతరములను గూర్చి) పల్కి, స్తుతించి, శువర్ మిశై శార్త్తియుమ్ = గోడలపై చిత్తరువులు వ్రాసియు, వైత్తుమ్ = (విగ్రహముగా) ప్రతిష్ఠను చేసియు, తొழువర్ = నమస్కరింతురు, (కాని), ఉలకు అళన్ద = (కొలుచువారి శిరస్సులో, కొలువబడువారి శిరస్సులో శ్రీపాదమును ఉంచి) లోకములను అన్నిటిని కొలిచిన, మూర్‌త్తి ఉరువే = త్రివిక్రమమూర్తియొక్క శ్రీపాదములే, ముదల్ = ప్రధానములు.



**అవతారిక :–** ఇట్లు రుచి మొదలుకొని అన్నిటిని కల్గించి, తానే ముందుకు వచ్చియున్న సర్వేశ్వరుని వీడి, సంసారులు కనబడిన దేవతలందఱి కాళ్ళలో మొక్కి తిరుగుచున్నారే! అనినచో, జ్ఞానహీనులగువారు అట్లు చేసినను, వారిచే ఆశ్రయింపబడు దేవతలచేకూడ ఆశ్రయింపబడువాడితడే – అనుచున్నారు.

**వ్యాఖ్య :– (అవరవర్)** – లోకములలో కొందఱికి రజోగుణము అధికముగానుండును. కొందఱికి తమోగుణము అధికముగానుండును. అట్టివారు పరమసాత్త్విక దైవమును ఎట్లు ఆశ్రయింపగలరు? **"సాత్త్విక స్స తు విజ్ఞేయః"** (భారతమ్) అనునట్లు ఆగర్భ శ్రీమంతులగు సాత్త్వికులే నిజమైన పరమపురుషుని ఆశ్రయింపగలరు.

**(అవరవర్) "లోకో భిన్నరుచిః"** (రఘువంశమ్ –5) (లోకములోని జనులు వేఱ్వేరు రుచులను కలవారు) అను రీతిలో కొందఱికి తామసాహంకారములందును, తామస కృత్యములందు మాత్రమే రుచి కల్గియుండుటను, కొందఱికి రాజసాహంకారము లందు, రాజసకృత్యములందు మాత్రమే రుచి కల్గియుండుటను, ఎవరికో కొద్దిమందికి మాత్రమే సాత్త్విక కృత్యములలో అభినివేశమును కల్గియుండుటయును చూచుచున్నాము. దేవతల విషయములందును ఇట్లే కదా ఉండును! దానిని తెలియలేక కొందఱు మేధావులు ఏ దేవతను ఉపాసించినను ఒకటే – అనుచు పల్కుటయే విచిత్రము.

**(తామ్ తామ్ అఱిన్ద వాఱు ఏత్తి)**–మానవుల జ్ఞానమును గమనించినను, అదియు ఒకే రీతిలో నుండదు. (దీనికి కారణము రజస్తమోగుణములే) అందుచే, తమ తమ జ్ఞానములకు తగినట్లు పలు పలు క్షుద్రదేవతలను స్తుతించువారుగానే లోకములోని వారుందురు.

**(తామ్ తామ్ అఱిన్ద వాఱు)** సత్త్వగుణము అతిశయించియున్నచో, **"సత్త్వాత్ సంజాయతే జ్ఞానమ్"** (భ.గీ) (సత్త్వగుణమువలన యథార్థజ్ఞానము కల్గును) అనునట్లు శాస్త్రవిచారమును చేసి, జ్ఞానవైశద్యమును పొందుదురు. అది లేకపోవుటచే, "మనస్సే ప్రభువు, బుద్ధియే మంత్రి" అను తమ అల్పజ్ఞానమునకు తగినట్లు ఒక దేవతను పరతత్త్వముగా నిశ్చయించుకొని, ఆ దైవమును పొగడుదురు. **"పుదైప్పలతానతి దెయ్‌వమ్ పేణుదల్ తనదు పుల్లఱివు ఆణ్మై పొరున్ద క్కాట్టి"** (తిరువాశిరియ–6) అని పరమపరమపురుషుని దర్శించిన నమ్మాళ్వార్లు పల్కిరి.

**(ఇవర్ ఇవర్ ఎమ్బెరుమాన్ ఎన్ఱు)** – తమవలెనే రజోగుణమును, తమోగుణమును అధికముగాగల దేవతలను "మా స్వామి" అని అభిమానించి.

**(ఇవరివర్)** – సగరపుత్రులు కనబడినవారిని అందఱిని "మా గుఱ్ఱమును పట్టు కొంటివి" అని వారిని బంధించునట్లుగా, తోచినవారిని పట్టుకొనుట – అని ఇచటి శ్రీపెరియవాచ్చాన్ పిళ్ళై రస్యవ్యాఖ్య.

**(ఇవరివర్)** – ఒక నియమము లేదు, లెక్క లేదు. ఒకడు, బ్రహ్మ ఉషస్సుతో కలసినపుడు జన్మించిన రుద్రుని స్వామి అనెను. వేఱొకడు, ఆ రుద్రుని భార్యయగు పార్వతియే పరతత్త్వమనెను. మఱియొకడు, ఇతని చిన్నకుమారుడగు కుమారస్వామియే పరబ్రహ్మమనెను. ఇంకను వేఱొకడు, అతని పెద్దకుమారుడగు గణపతియే పరతత్త్వమనెను. ఇంకను ఇంకొకడు అతని కామావేశముచే వీర్యము క్రిందపడి పుట్టిన అయ్యన్‌ను పరతత్త్వమనెను. ఇంకను, పలువురు, పల్కు దేవతల సంఖ్యకు లెక్క లేనేలేదు. ఇది ఏమి అజ్ఞానము! ఎవడైనను ఒకడు తాను పల్కు దేవత తనవలెనే జన్మను కల్గినదియే అనుటను, ప్రకృతి సంబంధమును కల్గినదియే అనుటను ఆలోచించి చూచుటలేదే! దీనిని తెలివైన వాడొకడు చెప్పినచో, ద్వేషమని అతనిని దూఱుటలో, అతడు నమస్కరించు వేదప్రతిపాద్యుడగు శ్రియఃపతిని తక్కువజేసి మాటలాడుటలో వెనుకంజ వేయుట లేదు. **"అజాయమానో బహుధా విజాయతే"** (పు.సూ) అని వేదము, **"పిఱప్పిల్ పల్ పిఱవి ప్పెరుమాన్"** అని ఆళ్వార్లును, **"పిఱవా ప్పిఱప్పిల్ పిఱప్పిత్తోర్ ఇల్లైయే"** అని మధ్యస్థులగు సంఘకవులును శ్రియఃపతిని గూర్చి పల్కుటనుకూడ గమనించుట లేదు.

**(శువర్‌మిశై చ్చార్‌త్తియుమ్ వైత్తుమ్ తొళ్లువర్)** – ఆ దేవతలమీది అభిమానముతో గోడలపై బొమ్మలను వ్రాసి, గృహములు, ఆలయములు, పర్వతములు మొదలగు వానిచోట్ల విగ్రహములు నిలిపియు, కొలుచుచున్నారు.

**(ఉలకళన్ద మూర్‌త్తి యురువే ముదల్)** – వీరు పక్షపాతముతో కనబడిన దేవతలను కొలిచినను సత్యము మాఱదుకదా! ఆశ్రయించుచున్న వీరితో పాటు, వీరు ఆశ్రయింపగోరుచున్న ఆ దేవతలతో పాటు భేదము లేకుండునట్లు, అందరును తన కాలికి మొక్కినట్లు లోకమునంతటిని కొలిచిన సర్వేశ్వరుని దివ్యదేహమే జగత్కారణము.

**(ఉలకళన్ద)** – దీనిని నేను ఈనాడు కొత్తగా పల్కుట లేదు. పక్షపాతమును కలకొందఱు చేతనులు చెప్పలేదు. అపౌరుషేయమగు వేదము వేలాది సందర్భములలో చెప్పినది – అని భావము.

**(ఉలకళన్ద మూర్‌త్తియురువే ముదల్)** – **"ఏకః ప్రాసీసరత్ పాద మేకః ప్రాచిక్షిపన్ముదా, అపరోఽభ్యధర న్మూర్ధ్నా కోఽధిక స్తేషు గణ్యతామ్"** (ఒకడు (విష్ణువు) శ్రీపాదములను చాచెను, వేఱొకడు (బ్రహ్మ) సంతోషముతో దానిని స్పృశించెను. ఇంకొకడు (రుద్రుడు) ఆ నీటిని తలపై ధరించెను. వీరిలో ఎవరు గొప్పవాడు అనుటను మీరే మధ్యస్థులైయుండి లెక్కించి చూడుడు) అను రీతిలో ఆళ్వార్లు పల్కుచున్నారు.

**పెరియ :– పతినాలామ్బాట్టు, ప్రకృత్యా ఆశ్రయిక్కుమవర్‌కళైయు ఞ్జొల్లి, ఆశ్రయిప్పిత్తుక్కొళ్ళుమవనైయుఞ్జొల్లిగ్ర్‌ఱు. ఇతు ఒన్ఱుమ్ పెఱాతారై చ్చొల్లుకిఱతు.**



**(అవరవర్) రజఃప్రచురరమ్, తమఃప్రచురరుమ్. (తాన్దా మఱిన్దవాఱేత్తి) గుణానుగుణమాక వెళిచ్చెఱిన్దపడి ఏత్తి.**

**(ఇవరివర్ ఎమ్బెరుమానెన్ఱు) రజస్తమస్సుక్కు విషయమానారై "ఎన్నుడైయ స్వామి" యెన్ఱు.**

**(శువరిత్యాది) సర్వేశ్వరన్బక్కల్ "ఎవ్వణ్ణమ్ శిన్దిత్తిమైయాతిరుప్పర్" ఎన్గిఱ శెయలిల్ భిత్తియిలే ఎళ్ళుతియుమ్, వైత్తుమ్ తొళ్లువర్.**

**(ఉలకిత్యాది) ఇవర్‌కళుడైయువుమ్, ఆశ్రయణీయజ్గళుడైయవుమ్ తలైయిలే అడియైవైత్తవనే ప్రధానమ్.**

**(మూర్‌త్తియురువే ముతల్) సర్వేశ్వరనుడైయ తిరుమేనియే ప్రధానమ్.**

**అవ – అవనై వేణ్డాతార్ పడుకిఱ పాడు పాఱీర్.**

**(అవరవర్) భిన్నరుచికళ్.**

**(తాన్దా మఱిన్దవాఱు) శాస్త్రత్తిన్ పిన్ శెల్లార్.**

**(ఇవరివర్) సగరపుత్రర్‌కళ్, కణ్డారై "ఎన్ కుతిరై పిడిత్తాయ్!" ఎన్ఱు పిడిక్కుమాప్పోలే తోగ్ర్‌గ్రినారై.**

**(ఉలకళన్ద) సమాశ్రయిప్పార్ తలైయిలుమ్, సమాశ్రయణీయర్ తలైయిలుమ్ ఒక్కత్తుకైత్త సర్వేశ్వరన్.**

**(ఉరువే ముతల్) వడివే ముతల్.**

**అరు :– పతినాలామ్బాట్టు. శెయలిల్ అనుకూలర్ శెయ్‌కిఱ న్యాయత్తిలే, తాజ్గళుమ్ రుచ్యనుగుణామాన బిమ్బజ్గళై ప్పణ్ణి త్తొళ్లువర్‌కళ్ ఎన్నపడి. మేలుక్కు అవతారికైయరుళిచ్చెయ్ కిఱార్ (అవనై వేణ్డాతారిత్యాది).**

*నమ్బిళ్ళై :– పదినాలామ్బాట్టు :– అవన్ ముఱ్పాడనుమాయ్, రుచికరనుమాయ్ ఇరుక్కచ్చెయ్‌దే, సంసారికళ్ పుఱమ్బే శిలరై ఆశ్రయణీయరాక క్కొణ్డుపోరానిన్ఱార్‌కళే! ఎన్నిల్, అవర్‌కళ్ అప్పడి చ్చెయ్‌దార్‌కళేయాకిలుమ్, అన్ద ఆశ్రయణీయర్‌తజ్గళుక్కుమ్ ఆశ్రయణీయన్ సర్వేశ్వరనే – ఎన్గిఱార్.*

*(అవర్ అవర్) – రజస్తమస్సుక్కళాలే అభిభూతరాయ్, భిన్నరుచికళాకైయాలే "అవరవర్" ఎన్ఱు అనాదరిత్తు చ్చొల్లుకిఱార్.*

*(తామ్ తామ్ అఱిన్ద వాఱు ఏత్తి) కర్మమడియాక వన్ద రుచియుమ్, అతుక్కీడాన జ్ఞానముమాయితే యిరుప్పతు. శాస్త్రత్తిన్ పిన్ శెల్లార్‌కళే! ఆకైయాలే తాన్దామ్ అఱిన్ద ప్రకారజ్గళాలే స్తోత్రమ్ పణ్ణి.*

*(ఇవర్ ఇవర్ ఎమ్బెరుమాన్ ఎన్ఱు) – అవరై అవరై వన్దారై ప్పిడిత్తు, "ఇవర్కళ్ నమక్కు స్వామికళ్" ఎన్ఱు. సగరర్కళ్, కణ్డారై, "నీ ఎన్ కుదిరైయై పిడిత్తాయ్, నీ ఎన్ కుతిరైయై పిడిత్తాయ్" ఎన్ఱు పిడిక్కుమాపోలే. నల్లవస్తుక్కళ్ ఎల్లామ్ కిడక్క, వెమ్బుమ్, ఉళ్ళియుమ్ ఉకప్పారైప్పోలే, తాజ్గళ్ ఉకన్ద గుణజ్గళై ఉడైయ దేవతైకళై ఉకప్పర్కళ్. "సత్త్వనిష్ఠా హి పురుషాః" ఇత్యాది. "హరి రేక స్సదా ధ్యేయః" ఎన్ఱు రుద్రన్తానే శొన్నాన్.*

*(శువర్మిశై చ్చార్త్తియుమ్ వైత్తుమ్ తొఴువర్) ఓరో భిత్తికళిలే లిఖిత్తు, ఓరో విడజ్గళిలే ప్రతిష్ఠిప్పిత్తుమ్ తొఴానిఱ్పర్కళ్. సర్వేశ్వరన్ ఆశ్రితానుగ్రహార్థమాక ఓరో పడికళై క్కొడువన్దాల్, అజ్గే శెయ్యక్కడవ శెయల్కళై.*

*(ఉలకళన్ద మూర్త్తియురువే ముతల్) జగత్తైయడైయ త్తన్ తిరువడికళిల్ కీఴ్ యిట్టుక్కొణ్డ సర్వేశ్వరనుడైయ తిరుమేనియే ప్రధానమ్. సమాశ్రయిప్పార్తలైయిలుమ్, సమాశ్రయణీయర్తలైయిలుమ్ ఒక్క త్తుకైత్తవన్.*

అప్పిళ్ళై :- అవ :- పతినాలామ్పాట్టు. ఇప్పడి రుచ్యుత్పాదకనాయ్, ముఖ్యాదనాయ్ క్కొణ్డు నిత్యమవనై విట్టు సంసారికళ్ క్షుద్రదేవతాసమాశ్రయణమ్ పణ్ణానిన్ఱార్కళే? ఎన్నిల్, అవర్కళ్ అప్పడి చ్చెయ్తార్కళేయాకిలుమ్ అన్ద అశ్రయణీయరాన దేవర్కళుక్కు మాశ్రయణీయ నవనే – ఎన్గిఱార్.

అవర్వర్ – రజస్తమఃప్రచురరాయ్ భిన్నరుచికళాల్ అవ్వవధికారికళ్, తాన్దామ్– శాస్త్రముఖత్తాలన్ఱిక్కే గుణానుగుణమాక త్తాన్దామ్, అతిన్ద, అఱు – ప్రకారజ్గళాలే, ఏత్తి– వాయ్విట్టు ప్పుకఴ్న్దు, ఇవరివర్ – తాజ్గళుకన్ద గుణజ్గళైయుడైయ అయ్యన్, దుర్గై తుడక్కమాక రుద్రన్ ముడివాకవుణ్డాన ఇవర్కళివర్కళే, ఎమ్ – నమక్కు, పెరుమాన్– అశ్రయణీయరాన స్వామికళ్, ఎన్ఱు – ఎన్ఱు ఆదరిత్తుక్కొణ్డు, శువర్మిశై – ఓరో భిత్తికళిలే, శార్త్తియుమ్ – చిత్రరూపేణ ఎఴుతియుమ్, వైత్తుమ్ – గృహస్తుడక్కమాన ఓరో విడజ్గళిలే ప్రతిమారూపేణ ప్రతిష్ఠిత్తువైత్తుమ్, తొఴువర్ – అశ్రయియానిఱ్పర్కళ్. ఉలకు – అవర్కళ్ అప్పడిశెయ్తాలుమ్ అశ్రయిక్కిఱవర్కళోడు, అశ్రయణీయరాక ఇవర్కళ్ విరుమ్బుకిఱ అద్దేవతైకళోడు వాశియఱ ఎల్లారుమ్ తన్ కాత్కీఴే తుకైయుణ్ణుమ్బడి జగత్తై, అళన్దు – అళన్దు కొణ్డ, మూర్తి – సర్వేశ్వరనుడైయ, ఉరువే – తిరుమేనియే, ముతల్ – ప్రధానమ్.

దివ్యార్థ :- (అవరవర్ తాన్దామ్) కీఴ్ ప్పాట్టిల్ "ఆదియాయ్ నిన్ఱారవర్" ఎన్ఱతై వివరిత్తు ప్పేశుకిఱదు, ఇప్పాట్టు. ఉలకత్తిలుళ్ళ జనజ్గళ్ ఒవ్వొరు దెయ్వజ్గళై ప్పరదేవతైయాక క్కొణ్డు, తామ్తామ్ కఱ్ఱ శొఱ్కకళై క్కొణ్డు అద్దెయ్వజ్గళై త్తుదిత్తు, విగ్రహారాధనమ్ విశేష మెన్ఱఱిన్దు, శువర్కళిలే శిత్తిరరూపమాక అద్దెయ్వజ్గళై ఎఴుదియుమ్, లోహమయ బిమ్బమ్బళాక ఆలయజ్గళిలే ప్రతిష్టై శెయ్దుమ్ తొఴానిన్ఱార్కళాకిలుమ్, అమ్మన్, పిడారి



**ముదత్కొణ్డు శివన్ ముడివాకవుళ్ళ దెయ్వజ్గళుక్కెల్లామ్ శ్రీమన్నారాయణమూర్త్తియే పిరదాన దేవతైయామ్–ఎన్ఱారాయిఱ్ఱు. కీఴ్ప్పట్ట దెయ్వజ్గళెల్లామ్ ఎమ్బెరుమానై ఆశ్రయిత్తే సత్తై పెఱవేణ్డుమ్బడి అవనే ముఴుముదఱ్కడవుళ్ – ఎన్ఱపడి.**

**"అవరవర్" ఎన్ఱ శుట్టు అవర్కళిన్ కుణక్కుఱైవై క్కాట్టుమ్. సత్త్వగుణపూర్త్తి యిల్లాద జనజ్గళెల్లామ్ – ఎన్ఱపడి. తాన్దామ్ అఱిన్దవాఱావదు – శాస్త్రజ్గళైయుమ్, శిష్టాచారజ్గళైయుమ్ కొణ్డు అఱియకిల్లామల్, తజ్గళుడైయ రాజసతామసబుద్ధికళుక్కు ఏఱ్ఱియవాఱు.**

**ఇప్పాట్టిల్ శ్రీమన్నారాయణన్ "ఉలకళన్ద మూర్త్తి" ఎన్ఱ తిరునామత్తాల్ కుఱిప్పిట్టదు కరుత్తోడుకూడియదామ్. పురుషోత్తమనాన ఎమ్బెరుమానై విట్టు క్షుద్రదెయ్వజ్గళై ప్పణికిన్ఱ సంసారికళోడు, అద్దెయ్వజ్గళోడు వాశియన్ఱియే ఎల్లారుమ్ తన్నుడైయ తిరువడియిన్ కీఴ్ తుకై యుణ్ణుమాఱు ఉలకజ్గళై వ్యాపిత్తవన్ ఎన్ఱు శొల్లుమాఱ్ఱాల్ అవనే ముఴుముదఱ్కడవుళ్ ఎన్ఱు మూదలిత్తారాయిఱ్ఱు. మూర్త్తి – స్వామి.**

**దివ్యార్థ :- అను :- (అవరవర్ తాన్దామ్)** గతపాశురంలోని **"ఆతియాయ్ నిన్ఱారవర్"** అనే ప్రయోగాన్ని వివరిస్తున్నది ఈ పాశురం. లోకంలోని జనం ఒక్కొక్క దైవాన్ని పరదేవతగా గ్రహించి, తాము తాము నేర్చిన మాటలతో ఆ దైవాలను స్తుతించి, విగ్రహారాధనం విశేషమని తెలిసి, గోడలపై చిత్తరువుల రూపంలో ఆ దైవాలను చిత్రించి, లోహమయ బింబాలుగా ఆలయాలలో ప్రతిష్ఠచేసి, నమస్కరిస్తున్నారు. అయినా, అమ్మన్, పిడారి మొదలుకొని శివునివరకు గల దైవాలకు అన్నిటికీ శ్రీమన్నారాయణమూర్తియే ప్రధానదేవత – అని అన్నట్లయింది. అధములైన దైవాలన్నీ ఆ స్వామిని ఆశ్రయించే సత్తను పొందవలసినట్లు అతడే మొట్టమొదటి దైవం–అని భావం.

**"అవరవర్"** – అనే ద్విరుక్తి వారి వారి గుణహైన్యాన్ని తెలుపుతుంది. సత్త్వగుణ పూర్తి లేని జనులంతా – అని అర్థం. **"తాన్దా మఱిన్ద వాఱు"** – అంటే శాస్త్రాలతో, శిష్టాచారాలతో తెలిసికోలేక, తమ రాజసతామసబుద్ధులకు తగినట్లు – అని అర్థం.

ఈ పాశురంలో శ్రీమన్నారాయణుని **"ఉలకళన్ద మూర్త్తి"** అనే తిరునామంతో నిర్దేశించడం సాభిప్రాయకం. పురుషోత్తముడైన భగవానుని విడచి, క్షుద్రదైవాలను సేవిస్తున్న సంసారులతోపాటు, ఆ దైవాలతోపాటు తేడా లేకుండా అందఱు తన శ్రీపాదాల క్రింద శరణు పొందేటట్లు, లోకాలను వ్యాపించినవాడనే చెప్పే వాగ్బలంతో ఇతడే పరదైవమని స్థిరీకరించారు. **"మూర్త్తి"** – స్వామి.

**(15) ముదలావార్ మూవరే (ర్), అమ్మూవరుళ్ళుమ్**
**ముదలావాన్ మూరినీర్ వణ్ణన్, – ముదలాయ**

**నల్లా నరుళల్లాల్ నామనీర్ వైయకత్తు,**
**పల్లా రరుళుమ్ పఝుదు**

మూవరే = బ్రహ్మ, విష్ణు, శివులు – అను ముగ్గురే, ముదలావార్ = ముఖ్యమైనవారు, అమ్మూవరుళ్ళుమ్ = ఆ మూడు మూర్తులలోను; మూరి నీర్ వణ్ణన్ = విస్తరించిన సముద్రమువంటి వర్ణమును, స్వభావము కల భగవానుడే, ముదలావాన్= కారణభూతుడు, ముదల్ ఆయ = సర్వకారణభూతుడైనవాడు, నల్లాన్ = ఉపకారకుడను అగు అతనియొక్క అరుళ్ అల్లాల్ = కృపను తప్ప, నామ నీర్ వైయకత్తు = ప్రసిద్ధమైన సముద్రము చుట్టియున్న భూలోకములో, పల్లార్ = మిగిలిన పలువురియొక్క , అరుళుమ్ = కృపకూడ, పఝుదు= వ్యర్థమైనది.

**అవతారిక :–** మీరు లోకములను కొలిచిన త్రివిక్రమమూర్తియే కారణభూతుడు – అని అనుచున్నారు. కొందఱు కాళి, కరుప్పన్ మొదలగు అన్యదైవములను కారణములుగా చెప్పుచున్నారు. కొందఱు త్రిమూర్తులలో బ్రహ్మ, రుద్రుడు అను మిగిలిన ఇద్దఱిని కారణభూతులుగా చెప్పుచున్నారు. ఆ దైవములు తమకు ఫలమును ఇచ్చుటయును నిదర్శనముగా చూపుచున్నారు. మఱి కొందఱు ఈ ముగ్గురి కంటెను వేఱయిన తత్త్వమే పరదైవమనుచున్నారు. ఆ పరతత్త్వ మేది? అని ప్రశ్నించినచో, కొందఱు పరమశివుడను చున్నారు; కొందఱు పరాశక్తి అనుచున్నారు; కొందఱు మహాగణపతి అనుచున్నారు; ఇంకను కొందఱు సుబ్రహ్మణ్యస్వామియే అనుచున్నారు. "ఊరు రెండయినచో ఆటగానికి సులభము" అనునట్లు వీరిలో ఏర్పడిన ఈ తగవును ఉపయోగించుకొని వేఱు కొందఱు మేధావులు ఇవి అన్నియును, నీవును, నేనుకూడా పరతత్త్వమే."–అని చెప్పుచున్నారు. ఇట్లున్నపుడు, "లోకములను కొలిచిన స్వామియే మూలకారణము" అని మీరు వివరించుట ఎట్లు?" అనినచో, "ఇవి అన్నియును వేదవిరుద్ధభాషణములు, నేను పలుకబోవునదియే వేదశాస్త్రానుకూలము – " అని ఆళ్వార్లు పల్కుచున్నారు.

**వ్యాఖ్య :– (ముదలావార్ మూవరే)** – వేదశాస్త్రములను పురస్కరించుకొని చూచినచో, సృష్టిని చేయువాడుగా చెప్పబడు బ్రహ్మయును, రక్షణను చేయువాడుగా తెలియబడు విష్ణువును, సంహారమును చేయువాడుగా తెలియబడు రుద్రుడును మాత్రమే ముఖ్యులు– అని సులభముగా తెలియవచ్చును. నీవు, నేను పరతత్త్వమైనచో, ఈ లోకములో మనము దుఃఖములను అనుభవించుట ఉండకూడదు. దానికి కారణమగు శరీర సంబంధమును మనకు ఉండకూడదు. అందుచే నీవును, నేనును పరత్త్వములగుటకు అవకాశము లేదు. కాళి, కుమారస్వామి, గణపతి, అయ్యప్ప వేదములలో ఎచటను పరతత్త్వముగా చెప్పబడలేదు. పరబ్రహ్మకార్యమైన సృష్టిస్థితిసంహారములనెడి త్రివిధ



కృత్యములందు వీరికి ఏ విధమైన సంబంధమును ఉన్నట్లు లోకములో గాని, వేదములో గాని చెప్పబడలేదు. అందుచే సృష్టి–స్థితి–సంహారములను చేయునట్టి బ్రహ్మవిష్ణురుద్రులే దేవతలలో ముఖ్యమైనవారు. **"ముదలావార్ మూవరే"** అను ఈ మాటకు ఆక్షేపముగా నాల్గవ పక్షమువారు పలుకు వాదమే మనగా – లోకములో బ్రహ్మ విష్ణువుయొక్క నాభీకమలమునుండి పుట్టినట్లు ప్రసిద్ధి కలదు. రుద్రుడును బ్రహ్మకు పుట్టినవాడని పలు వేదవాక్యములు తెలుపుచున్నది. **"బ్రహ్మావిష్ణురుద్రేంద్రాః తే సర్వే సంప్రసూయంతే"** (అధర్వశిఖా) అని కొన్ని వేదవాక్యములు వీరితోకూడ విష్ణువునకును ఉత్పత్తి తెలుపు చున్నవి. అందుచే ఈ మూడింటికంటె గొప్పది అయినది ఏదియో, అది ఒక్కటే పరతత్త్వము కావలయును – అని చతుర్థ బ్రహ్మావాదులు వాదింతురు.

ఆయినచో, ఆ ఒక్కటి ఏది? అని అడిగినచో, శివునిపట్ల పక్షపాతమును కలవారు, "ఆ పరతత్త్వము పరమశివుడే" అని అందురు. శక్తిపట్ల పక్షపాతమును కలవారు పరాశక్తియే పరతత్త్వమందురు. ఇట్లు పలువురు పలు రీతులలో పల్కుదురు. కాని, ఇవి అన్నియు వేదవిరుద్ధములు. పరతత్త్వమే శివశబ్దముచే చెప్పబడుటనుబట్టి, కర్మపరవశుడగు రుద్రునికంటె గొప్పవాడైన ఒక శివుని కల్పింప ప్రయత్నించినచో, పరతత్త్వమును ఇంద్రశబ్దముచే, ఆకాశశబ్దముచే, వాయుశబ్దముచే చెప్పబడుటనుబట్టి పరమేంద్రుడు, పరమాకాశము, పరమవాయువు – అను తత్త్వములను కల్పించి, అవియే పరతత్త్వమని చెప్పవలసియుండును. వేదవాక్యములన్నియు పరస్పరవిరుద్ధములై పర్యవసించును. త్రిమూర్తులకంటె గొప్పదైన దొక దేవత త్రివిధకార్యములను చేయు చున్నదని వేదములో ఎచటను చెప్పబడలేదు. "దేవతలలో విష్ణువే మిక్కిలి గొప్పవాడు, అగ్నియే అధముడు" అని ఒక వేదవాక్యము ఘోషించుచున్నది. "నారాయణుడే పరబ్రహ్మము, నారాయణునివలన బ్రహ్మ, రుద్రుడు మొదలగు అందఱు ఉత్పన్న మయ్యిరి", **"అంతర్బహి శ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః"** (పు.సూ) అనుచు పలు వేదవాక్యములు ఉద్ఘోషించుచున్నవి. దీనినిబట్టి విష్ణువునకు పైన ఎవరు లేరని, విష్ణువుయొక్క జన్మ అతని ఇచ్ఛామూలకము తప్ప కర్మసంబంధముచే కాదనియు ఏర్పడుచున్నది. అందుచే తురీయబ్రహ్మవాదము వేదవిరుద్ధము.

మఱియు, లోకములో కర్మపరవశుడగు రుద్రుడు వేఱు; పరమశివుడు వేఱు–అను సంప్రదాయము లేదు. రుద్రపత్నియగు పార్వతి వేఱు, పరాశక్తి వేఱు సంప్రదాయము లేదు. త్రినేత్రుడై శూలధారియై త్రిపుర సంహారాది కార్యములు చేసినవాడగు రుద్రుని మాత్రమే శైవులు కొలుతురు. రుద్రునకు వేదములలో అవరత్వము చెప్పబడినదని విననినే, "అతడు వేఱు, మా శివుడు వేఱు" అను వాదమును తమ మనఃసాక్షివిరుద్ధముగా చేయుదురు. అట్లే, పరాశక్తి భక్తులును వాదింతురు. అందుచే, తురీయ, పంచమాది

బ్రహ్మవాదము లోకవిరుద్ధము. కావున, త్రిమూర్తులే లోకములోని మిగిలిన అందఱికంటె ముఖ్యమైనవారని సిద్ధించుచున్నది. **"మూవరే"** అను ఏవకారముచే కనబడిన దైవములను అందఱిని పరతత్త్వమని చెప్పువారిని, తురీయపంచమాది బ్రహ్మవాదులను ఆళ్వార్లు నిరసించినవారయ్యిరి! **"మూవర్"** అను పాఠములో ఈ ఏవకారము అర్థాత్ సిద్ధము. ఇక, ఆళ్వార్లు ఈ త్రిమూర్తులును ఒకరే అని, త్రిమూర్తులును సమానులే అనియు చెప్పు త్రిమూర్త్యైక్య, త్రిమూర్తిసామ్యవాదములను నిరసించి, భగవత్పరత్వమును స్థాపించుచున్నారు.

**(అమ్మూవరుళ్ళుమ్ ముదలావాన్ మూరినీర్ వణ్ణన్)** – ఈ ముగ్గురును ఒకరే అనుట, సమానులనుటయు తగదు. ఎందులకనగా, వేదములో **"నారాయణా ద్బ్రహ్మా జాయతే, నారాయణాద్రుద్రో జాయతే"** (నారాయణోపనిషత్) (నారాయణునివలన బ్రహ్మ పుట్టుచున్నాడు. నారాయణునివలన రుద్రుడు పుట్టుచున్నాడు) అని నారాయణుని వలన మిగిలిన ఇద్దఱి జన్మ అని చెప్పబడినది. **"సోఽరోదీత్"** (శతపథమ్) (రుద్రుడు రోదించెను), **"సోఽబ్రవీత్ అనపహతపాప్మా వాహమ్"** (శతపథమ్) (నేను పాపము తీరినవాడనై యున్నాను – అని రుద్రుడు పల్కెను), **"వరం వృణే అహ మేవ పశూనా మధిపతి రసానీతి"** (యజుర్వేదము) (నేను పశుపతిని కావలయునను వరమును వేడుచున్నాను అని రుద్రుడనెను) **"సోఽబిభేత్"** (సుబాల) (మృత్యువును చూచి బ్రహ్మ భయపడెను), **"ఉషసి రేతోఽసించత్"** (శతపథమ్) (బ్రహ్మ ఉషస్సు అను తన దేవియందు వీర్యమును విడచెను), అనియు బ్రహ్మరుద్రులకు పాపభయసంబంధమును, ప్రాకృత శరీరసంబంధమును, అపూర్ణత్వమును వేదములలో తెలుపబడుటచేతను, నారాయణు డనెడి విష్ణువే వీరిని సృజించినవాడుగా, నియమించువాడుగా, ఏవిధమైన తక్కువదనము లేనివాడుగా చెప్పుటచేతను, ఈ ముగ్గురు సమానులే అను వాదముగాని, ఒకరే అనుటగాని పొసగదు.

**"స బ్రహ్మా స శివః"** (తై.నా–11) (అతడే శివుడు, అతడే బ్రహ్మ, అతడే శివుడు) **"బ్రహ్మా నారాయణః శివ శ్చ నారాయణః"** (బ్రహ్మయు నారాయణుడే, శివుడును నారాయణుడే) అనుచు వేదములు పల్కుటచే, ఈ ముగ్గురును ఒకరే అని తోచుచున్నది కదా! అనినచో, వీరిని మాత్రమే వేదములు నారాయణునితో ఒకటిగా చెప్పలేదు. **"సేంద్రః"** (తై.నా–11) (ఇంద్రుడును అతడే), **"శక్ర శ్చ నారాయణః"** (ఇంద్రుడును నారాయణుడే) అని త్రిమూర్తులలో తక్కువవాడు, **"అహల్యాయై జారః"** అని వేదములోను, శ్రీరామా యణాదులలోను పరదారాగమనమును చేసినవాడుగా సుప్రసిద్ధుడును అగు ఇంద్రుని నారాయణుడనియే పఠించినది.



**"చక్షు శ్చ ద్రష్టవ్యం చ నారాయణః"** (సుబాల) (కన్నులు, చూడబడు వస్తువులును నారాయణుడే), **"దిశ శ్చ నారాయణః విదిశ శ్చ నారాయణః....సర్వం నారాయణః"** (నారాయణోపనిషత్ ) (దిశలు, విదిశలును నారాయణుడే, అంతయు నారాయణుడే), **"పురుష ఏవేదమ్ సర్వమ్"** (పు.సూ.) (ఇది అంతయు పురుషుడే), **"విశ్వ మేవేదం పురుషః"** (తై. నా) (ఈ లోకమంతయు పరమపురుషుడే), **"సర్వం ఖల్విదం బ్రహ్మ"** (ఛాందో–3–14–1) (ఇది అంతయు పరబ్రహ్మమేకదా) అనుచు దుఃఖములలో అలమటించు అందరు చేతనులను, జ్ఞానశూన్యములగు అచేతనములనుకూడ నారాయణుడే అనియే వేదములు పఠించినవి. ఇట్లు అన్నిటిని ఒకటి అని పఠించుటకు కారణమును **"ఏష సర్వభూతాంతరాత్మా అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః"** (అన్ని భూతములలో అంతర్యామియైయుండు, అప్రాకృతుడగు దేవుడు నారాయణు డొక్కడే), **"అంతర్బహి శ్చ నారాయణః స్థితః"** (తై.నా– 11) (అన్ని పదార్థములయందు లోపల, బయట వ్యాపించి వెలుగువాడు నారాయణుడు) **"విశ్వాత్మానం పరాయణమ్"** (తై.నా–11) (సర్వాత్మయైయున్నవాడు నారాయణుడు) **"స భూమిం విశ్వతో వృత్వా"** (పు.సూ) (పరమపురుషుడు భూమి అంతట వ్యాపించెను), **"తజ్జలాన్"** (ఛాందో – 3–14–1) (పరబ్రహ్మయందే అన్నియు పుట్టి, జీవించి, నశించుటచే అంతయు పరబ్రహ్మమే) అని దాని సమీపములోనే ఆయా వేదవాక్యములు పల్కుచు వచ్చినవి.

**"అన్య శ్చ రాజన్ స పరః తథాన్యః పంచవింశకః, తత్ సత్వాదనుపశ్యంతి హ్యేకేవేతి సాధవః"** (భారతమ్) (ఓ రాజా! పరమాత్మ జీవునియందు అంతర్యామియై యుండుటచే ఇద్దఱిని ఒక్కరుగానే సత్పురుషులు చూచున్నారు) **"సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః"** (భ.గీ– 11–40) (నీవు అన్నిటిని వ్యాపించియుండుటచే అన్నియును అగుచున్నావు), **"సర్వగత్వా దనంతస్య స ఏవాహ మవస్థితః"** (వి.పు–1–19–85) (అనంతుడంతట వ్యాపించియుండుటచే నేను కూడా అతడినై ఉన్నాను) అని ఈ అర్థము ఉపబృంహణములయందును వివరింపబడినది. అందుచే, త్రిమూర్తులును ఒకరే అనునది వేదశాస్త్రవిరుద్ధమే అగును.

"సృష్టిస్థితి సంహారములను చేయు ఈ ముగ్గురు సమానులు. ముగ్గురను చేర్చి, పరతత్త్వమని చెప్పవచ్చునే! అనినచో, **"యతో వా ఇమాని భూతాని"** అను మొదలగు వేదవాక్యములలో మూడు వ్యాపారములను చేయువాడు ఒకడే – అని చెప్పబడుటయును, **"ఏక మేవాద్వితీయమ్" (ఛాందో – 6–2–1), "ఏక ఏవ నారాయణః"** (సుబాల), **"ఏక ఏవాగ్ర ఆసీత్"** (ఐతరేయమ్ –1–1–1),**"ఈశతే దేవ ఏకః"** (శ్వేత–1–10), **"ఏకః స్వతంత్రో జగతో బభూవ", "ఏకః శాస్తా న ద్వితీయోఽస్తి శాస్తా"** (భార ఆశ్వ–27–1) **"ఏక ఏవ జనార్దనః"** (వి.పు) మొదలగు వందలాది శ్రుతిస్మృతి వాక్యములలో జగత్కారణవస్తువు ఒకటేనని తెలుపబడుట, **"నారాయణః పరం బ్రహ్మ",**

**"నారాయణాత్ బ్రహ్మా జాయతే, నారాయణా ద్రుద్రో జాయతే"** అను మొదలగు వాక్యములలో నారాయణుడే పరమాత్మ అని, మిగిలిన ఇద్దఱిని అతడు సృష్టించువాడని పల్కియుండుటయును పొసగదు.

అందువలన, నారాయణుడు ఒక్కడే సాక్షాత్తుగాను, బ్రహ్మరుద్రులకు అంతర్యామియై యుండి సృష్టి సంహారములను చేయుచున్నాడని, విష్ణువై అవతరించి రక్షణమును చేయుచున్నాడనియు ఒప్పుకొని తీరవలెను; వేఱొక గతి లేదు. అందుచే త్రిమూర్తులు ఒకటియే అనియు, సమానులనియును పల్కు వాదములు వేదశాస్త్ర విరుద్ధములే యగును. వేదశాస్త్రములను మధ్యస్థులై నిలచి నిష్పక్షపాతముగా పరిశీలించువారికి నారాయణు డొకడే పరత్త్వమనునది స్పష్టముగా ప్రకాశించును – అని భావము.

**(అమ్మూవరుళ్ళుమ్ ముదలావాన్ మూరినీర్ వణ్ణన్)** – సృష్టిస్థితిసంహారములను చేయుటచే లోకములోనున్న మిగిలినవారియందును ముఖ్యులగు ఆ ముగ్గురిలోను కారణభూతుడైయున్నవాడు అలలు వీచు సముద్రమువంటి వర్ణమును, స్వభావమును కల నారాయణుడే.

**(మూరినీర్వణ్ణన్ ముదలావాన్) (పొన్నురువుమ్ శెన్దీ యురువమ్)** బంగారు వర్ణమును, ఎఱ్ఱని అగ్నివర్ణమును జగత్కారణము కాదు. సముద్రవర్ణమే **(మా కడలురువమ్)** జగత్కారణము. **"నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్కరా"** (తై.నా) అని వేదము కీర్తించిన రూపమే జగత్కారణము.

**(మూరినీర్ వణ్ణన్)** – జలము లోకములో అంతట వ్యాపించియుండునట్లే, బ్రహ్మరుద్రాది సకలదేవతలలో వ్యాపించియుండువాడు స్వామియే. పైన మిగిలిన దేవతలనుగూర్చి పల్కునపుడును **"నామ నీర్ వైయకత్తు పల్లార్"** అనుచు జలము చుట్టియున్న భూలోకస్థానమున వారిని నిలిపి పల్కిరి.

బ్రహ్మరుద్రాది అన్యదేవతలును తమను ఆశ్రయించువారికి దయజూపి, ఫలమును ఇచ్చునట్లు వేదశాస్త్రములలో చూచుచున్నాముకదా! అని అన్నచో, వారు ఇచ్చు ఫలములన్నియు బంధకములగుటచేతను, అల్పాస్థిరములగుటచేతను నిష్ఫలములు. సుస్థిరమైనది, మిక్కిలి గొప్పదగు మోక్ష ఫలమును ఇచ్చుటకు వారికి వీలుకాదు – అనుటను ఇకపై తెలుపుచున్నారు.

**(ముదలాయ నల్లాన్ అరుళల్లాల్) – "కారణం తు ధ్యేయః"** (అథర్వశిఖా) (జగత్ కారణ వస్తువే ధ్యానింపతగినది) అనునట్లు కారణవస్తువుపట్ల భక్తిని కల్గి, దానివలన పొందు అనుగ్రహమే (ఫలవంతము) సఫలము. కార్యకోటిలోనికి చేరినవారి అనుగ్రహము వ్యర్థము.



**(నల్లాన్ అరుళల్లాల్)** – త్రిగుణరహితుడై, సత్త్వగుణమును, సమస్తకల్యాణ గుణములను కలవాడగు నారాయణుని కరుణయే సఫలము. రజస్తమస్సులను కల బ్రహ్మరుద్రుల అనుగ్రహము వ్యర్థమే. రావణుడు, హిరణ్యకశిపుడు మొదలగువారిని బ్రహ్మ అనుగ్రహించెను. ఆ అనుగ్రహము వారి కష్టమునకుకూడ కారణమైనది. వరమిచ్చిన బ్రహ్మను ఇతనిని లోకమును క్లేశపెట్టినది. భస్మాసురుడు, బాణాసురుడు మొదలగువారికి రుద్రుడు వరమిచ్చెను. ఆ అనుగ్రహము వారికి, వరమిచ్చిన ఇతనికి, ఆపదను కల్గించినది. ఉపకారకుడగు నారాయణుడే ఆ ఆపదలనుండి బ్రహ్మరుద్రులను రక్షింపవలసివచ్చినది. ఇతని దయ అట్లు నిష్ఫలమైనది అనుటకు ఏ చరిత్రయు లేదు.

**(నామనీర్ వైయకత్తు పల్లా రరుళుమ్ పళుదు)** – ముఖ్యులగు బ్రహ్మరుద్రుల అనుగ్రహమే ఇటువంటిది అయినచో, ఇక లోకములోని మిగిలిన వారి అనుగ్రహమును గూర్చి చెప్పవలయునా?

**(నామనీర్ వైయకత్తు ప్పల్లార్)** ప్రసిద్ధమగు నీరు చుట్టియున్న లోకములోనున్న మిగిలిన దేవతలు **"మూరినీర్ వణ్ణన్"** (వ్యాపించియున్న నీరువంటి స్వభావమును కలవాడు) అని అతనినిగూర్చి పల్కుటచే, **"నామనీర్ వైయకత్తు ప్పల్లార్"** అని నీరు చుట్టియున్న భూమిగా నిలిపి, వీరినిగూర్చి పల్కుచున్నారు. ఇట్లు వీరియందుకూడ వ్యాపించియుండు వాడగుటచే, వీరి అనుగ్రహముకూడ నిజమునకు ఇతనిచే ప్రేరేపింపబడుటచేతనే కల్గుచున్నదనుటను తెలుపుచున్నారు.

**(పల్లార్ అరుళుమ్ పళుదు)** – రజస్తమస్సులు కలిసినవారివద్దనుండి కల్గు అనుగ్రహమగుటచే, దానిచే కల్గు ఫలము, ఆశ్రయించినవారిని ఇంకను, ఇంకను సంసారములోనే కట్టి పడవేయును. అల్పమును (నీచమైనదిగను) అస్థిరముగను నుండును. అందుచే వారి అనుగ్రహము వ్యర్థమే. నారాయణుని అనుగ్రహమే సఫలమనుచున్నారు. **"యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయాఽర్చితు మిచ్ఛతి, తస్య తస్యాచలాం శ్రద్ధాం తా మేవ విదధామ్యహమ్, స తయా శ్రద్ధయా యుక్తః తస్యారాధన మీహతే, లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్, అంతవత్తు ఫలం తేషాం తద్భవత్యల్ప మేధసామ్, దేవాన్ దేవయజో యాంతి మద్భక్తా యాంతి మా మపి"** (భ.గీ–7–21–, 22, 23) (నా శరీరమైయున్న ఏయే దేవతలపట్ల భక్తిని ఎవడు ఎవడు శ్రద్ధతో వారిని అర్చింపగోరునో, అతనికి నేను ఆ శ్రద్ధను చలింపకుండునట్లు చేయుదును. ఆశ్రద్ధతో కూడిన అతడు ఆయా దేవతలను ఆరాధించును. నా చేతనే అనుగ్రహింపబడు అల్పాస్థిరకామములను ఆయా దేవతలవలన అల్పజ్ఞులగువారు పొందు ఫలము అస్థిరమైనది. మిగిలిన దేవతలను స్తుతించువారు. (అస్థిరులు, అల్పులును అగు) ఆ దేవతలనే ఆశ్రయించుచున్నారు. నాపట్ల భక్తిని కలవారు (స్థిరమైనవాడను, మిక్కిలి

గొప్పవాడను అగు) నన్ను ఆశ్రయించుచున్నారు) అని గీతలో భగవానుడే మిక్కిలి స్పష్టముగా తెలిపెనుకదా!

**(నీర్ వైయకత్తు నామమ్ పల్లార్ అరుళుమ్ పళుదు)** అని అన్వయించి, నీరు ఆవరించిన భూమిలో కేవలము నామమాత్రమైన మిగిలిన దేవతల అనుగ్రహములు వ్యర్థములే–అనియును చెప్పవచ్చును. **"అరుళ్"** అను పేరు తప్ప, నిజమునకు ఇవి అనుగ్రహములు కావు – అని భావము. అనంతస్థిరఫలమును ఇవ్వకపోవుటతోపాటు, దానిని ఇవ్వగల్గిన భగవానుని అనుగ్రహమునుకూడ ఆటంకపఱచుటచే **"పళుదు"** (వ్యర్థము) అనుచున్నారు. **"అరన్ నారణన్"** అను పాశురము శివవిష్ణుసామ్యమును తెలుపుచున్నది – అని పల్కు మేధావులు ఈ పాశురమునకు ఏమి అర్థము చెప్పుచున్నారో తెలియవలెను. (గీతలోకూడ దేవతాసామ్యము చెప్పబడుచున్నది – అను వీరు పూర్వము ఉదాహరించిన గీతా శ్లోకములకును అర్థము ఏమియో చెప్పవలెను. అని శ్రీకృష్ణస్వామి అయ్యంగార్ వివరణము)

**"మూవరుళ్ళుమ్ ముదలావాన్ మూరినీర్ వణ్ణన్"** అనుటచే సముద్రజలము భూమిలోనంతట వ్యాపించునట్లు బ్రహ్మరుద్రులలోను వ్యాపించియున్నవాడు – అని, సముద్రజలము మేఘముగను, నదులుగను రూపొందునట్లే, తాను విష్ణువు మొదలగు అవతారములను ఎత్తి లోకములను రక్షించువాడనియు తెలుపబడినది.

**పెరియ :– పతినైన్దామ్పాట్టు. (ముతలావార్) అవ్వోదేవతైకళుమ్ ఆశ్రయణీయరాయ్ చ్చెల్లానిఱ్కచ్చెయ్తే, అవర్కళ్ అప్రధానర్, ఇవన్ ప్రధాననెన్ఱు శొల్లుకిఱతు ఉమ్ముడైయ పక్షపాతత్తాలేయిఱే! ఎన్న, అర్థతత్త్వ మిరున్దపడియై ప్పార్క్కలాకాతో? ఎన్గిఱార్.**

**(ముతలావార్ మూవరే) ఇరున్దతే కుడియాక ఆశ్రయణీయరన్ఱిఱే. మూవరిఱే ప్రధానర్!**

**(అమ్మూవ రిత్యాది) బ్రహ్మరుద్రాదికళుక్కు జీవవ్యవధానత్తాలే అన్తర్యామియాయుమ్, తన్బక్కలిఱే స్వేనరూపేణ నిన్ఱుమ్ కారణమావాన్.**

**(మూరినీర్ వణ్ణన్) పొన్నురువుమ్ తీయురువుమానవర్కళన్ఱు; పరప్పైయుడైత్తాన కడల్వణ్ణన్.**

**(ముతలాయ) కారణమాన.**

**(నల్లానరుళల్లాల్) అఱవనానవన్ అరుళల్లాల్.**

**(నామ మిత్యాది) అవనుడైయ అరుళొழிయ, అల్లాతారెల్లారుడైయ అరుళుమ్ పళుతు. అధికారికళాకైయాలే అవర్కళై ముఱ్పడచొన్నవిత్తనై. పళుతామిడత్తిల్**



**అవర్కళోడు, అల్లాతారోడు వాశి యిల్లై. అవనుక్కు వశరాయ్క్కొణ్డు ఫలన్తరిలో? ఎన్నిల్, ఇరణ్డుమ్ వ్యర్థమ్.**

**(ముతలాయ నల్లాన్) పెఱ్ఱతాయాకైయాలే పరివన్."ధర్మజ్ఞ శ్శరణాగత వత్సలః". ములైప్పాలిరుక్క విషపానమ్ పణ్ణువరో?**

**(నామమ్) నామమాత్రమాన పల్లార్ ఎన్నుతల్, ప్రసిద్ధమాన నీర్ వైయకమ్ ఎన్నుతల్.**

**(పల్లార్) కీழ்చ్చొన్న బ్రహ్మరుద్రాది కళకప్పద. తనిత్తనియుమ్ తిరళవుమ్. (పళుతు) వ్యర్థమ్.**

**అరు :– పతినైన్దామ్పాట్టు. వశరాయ్ – శరీరభూతరాయ్. ఇరణ్డుమ్ – కేవలస్వతన్త్ర రాయుమ్, అన్తర్యామియాకైయాలే శరీరవత్పరన్త్రరాయుమ్ ఇరణ్డు మెన్దపడి.**

*నమ్బిళ్ళై :– పదినైన్దామ్ పాట్టు :– నీర్ అవనైయే ప్రధాననాక చ్చొల్లానిన్దీర్. నాట్టిలే శిలరై చ్చిలర్ ఆశ్రయిక్కైయుమ్, అవర్కళ్ అవర్కళుక్కు ఫలప్రదానమ్ పణ్ణుకైయు మాయన్ఱో ఇరుక్కిఱదు ఎన్న, వర్కళ్ అజ్ఞనే శెయ్దార్కళేయాకిలుమ్, అవై యదజ్ఞ వ్యర్థమెన్గిఱార్.*

*(ముదల్ ఆవార్ మూవర్) – "ఇవర్ ఇవర్ ఎమ్బెరుమాన్" ఎన్ఱు ఇరున్దదే కుడియాక, ఆశ్రయణీయరాక తవిర్న్దు మున్నమ్ మూవరోడే శేరప్పెఱ్ఱోమిఱే. ఇని, ఇవరై క్కழிక్క అమైయుమిఱే – ఎన్ఱు కరుత్తు.*

*(అమ్ మ్మూవరుళ్ళుమ్ ముదలావాన్ మూరినీర్ వణ్ణన్) – ఇవర్కళ్ మూవరుక్కుమ్ అవ్వరుకే ఒరువన్ ప్రధాననాకిఱానుమన్ఱు. అన్ఱిక్కే, మూవరుజ్బాద ప్రధానర్ ఆకిఱారు మన్ఱు. ఇనిత్తాన్, మూవరుజ్బాద ఒన్ఱాకిఱారు మన్ఱు. అన్ద మూవరిలుమ్ వైత్తుక్కొణ్డు ప్రధాననానవన్. – సఞ్చరియానిన్ఱుళ్ళ కడల్పోలే యిరున్దుళ్ళ వడివైయుడైయవన్. బ్రహ్మరుద్రర్ కళుక్కు జీవవ్యధానేన అంతర్యామియాయుమ్, తన్ పక్కలిలే స్వేనరూపేణవుమ్ నిన్ఱు రక్షిక్కిఱాన్.*

*(మూరినీర్ వణ్ణన్) – "ఒరురువమ్ పొన్నురువమ్ ఒన్ఱు శెన్దీ" ఎన్గిఱ అవర్గళై క్కழிత్తు, "మా కడల్ ఉరువమ్" ఎన్గిఱ అత్తైయే పిడిక్కిఱార్.*

*(ముదలాయ నల్లాన్ అరుళ్ అల్లాల్) – ఇదుక్కు అడజ్ఞ కారణభూతనుమాయ్, ఇవర్గళై ఉడైయనుమాకైయాలే ఇవర్గళ్పక్కల్ వత్సలనుమాయిరున్దుళ్ళ అవనుడైయ అరుళల్లదు. ప్రసిద్ధియై యుడైత్తాన నీర్శూழ்న్ద పూమియిలుళ్ళ–,*

ఇన్నుమ్ ఇప్పునన్తన్నిలే వన్దాల్ వేణ్డుమ్బడియాయ్‌త్తిరుప్పతు. ఇదువాకిల్, అన్యార్థమ్ ఎన్నాకిలుమ్ కొళ్ళలామ్. నమ్మైయే కుఱిత్తు వన్దు విழுకిఱదెన్ఱు తోగ్ఱియిరుక్కుమాయ్‌త్తు.

*(మేల్) పణ్డు. (అశురర్ ఇత్యాది) ఇప్పసజ్గత్తాలే నరసింహత్తై క్కణ్డు హిరణ్యన్ అఞ్జిన పడియై నినైక్కిఱార్. అసురర్ కోనుణ్డు – హిరణ్యన్. అవన్ విழுన్దు ముడిన్దుపోక క్కణ్డు "శిఱుక్కనుడైయ విరోధియై పోక్కప్పెఱ్ఱోమ్" ఎన్ఱు ఉకన్దవనతాన తిరుమలై. "ఇన్నుమ్ ఆశ్రితర్క్కు విరోధమ్ వరుమాకిల్ తీర్క్కవేణుమ్" ఎన్ఱు అవన్ వన్దు నిఱ్కిఱ తిరుమలై . ఇరు విశుమ్బిల్ మీన్ వీழ క్కణ్డఞ్జుమ్ వేఙ్గడమే.*

అప్పిళ్ళై :– నాఙ్బుతామ్బాట్టు. ఆశ్రితవిరోధినిరసనమ్పణ్ణి యుకక్కు మితువే కిడీర్! – అవన్ ఇఙ్గుత్తై నిత్యవాసత్తుక్కు ప్రయోజనమాక నినైత్తిరుప్పతు ఎన్గిఱార్.

కై – "అవష్టభ్య మహద్ధనుః" ఎన్గిఱపడియే ఒరు కైయిలే ఎడుత్తు ప్పిడిత్త, పెరు– పెరియ, విల్ – విల్లైయుమ్, పకழி – వాయమ్బుకళైయు ముడైయరాన, కుఱవర్ – తిరుక్కుఱవర్ మఱుకిల్ వழிయిల్ వెళిచ్చిఱప్పుక్కాక పిడిత్త, శెమ్ – శివన్ద నిఱత్తైయుడైత్తాన, తీ–శుళ్‌నెరుప్పి నొళివழிయే, వెరువి – ఇవర్కళ్ "కైయుమ్ విల్లు మ్బిడిత్త (శూళు) అమ్బుమాయ్ క్కొణ్డు ఆయత్తప్పట్టు వరుకిఱపడియై క్కణ్డు నమ్మై నలియవరుకిఱార్కళ్" ఎన్ఱు భయప్పట్టు, "ఒరుకాలు మిఙ్గు వరక్కడవోమల్లోమ్" ఎన్ఱు, పునమ్ – పునత్తై, తుఱన్ద – సన్న్యసిత్తుప్పోన, వేழమ్ – ఆనైయానతు పోమిడన్దన్నిలుమ్, ఇరు – పరప్పైయుడైత్తాన, విశుమ్బిల్ – ఆకాశత్తిల్ నిన్ఱుమ్, మీన్ వీழ – నక్షత్రఙ్గళ్ విழ, కణ్డు – అత్తై క్కణ్డు, అఞ్జుమ్ – "నమక్కవ్వరుకోరడి యిడవొణ్ణాతపడి భూమియిలే నెరుప్పై విழవిట్టార్కళ్" ఎన్ఱు అవ్వరుకు పోకమాట్టామల్, పునత్తిల్ పుకమాట్టామల్ నడువే నిన్ఱు నడుఙ్గుమ్బడియాన, వేఙ్గడమే – తిరుమలైయే, మేల్ – మున్బొరుకాలత్తిలే, అశురర్‌కోన్ – అసురరాజనెన్ఱు విరుతూతి త్తిరిన్ద హిరణ్యన్, వీழ క్కణ్డు – పిణమాయ్ విழுన్దుపోక క్కణ్డు, ఉకన్దాన్ "శిఱుక్కన్ విరోధి పోకప్పెఱ్ఱోమ్" ఎన్ఱు ఉకన్ద సర్వేశ్వరన్, కున్ఱు – పిన్బుళ్ళ ఆశ్రితవిరోధికళైయుమ్ నిర్వహిక్కవేణు మెన్ఱు వర్త్తిక్కిఱ మలై.

దివ్యార్థ :– (పెరువిఙ్బుకழி) – "వేఙ్గడమే అశురర్‌కోన్ వీழ క్కణ్డు ఉకన్దాన్ కున్ఱు" – భాగవతవిరోధియాన ఇరణియనై త్తొలైత్తు ప్పరమభాగవతనాన ప్రహ్లాదనై క్కాత్తరుళిన పెరుమాన్ అన్ద ఆశ్రితపక్షపాతమహాగుణత్తై వెళియిట్టుక్కొణ్డు, ఇన్ఱైక్కుమ్ సేవైసాదిక్కు మిడమ్ తిరుమలైర్ ఎన్గిఱార్. అత్తిరువేఙ్గడమ్ ఎప్పడిప్పట్ట దెన్న – అవ్విడత్తు చ్చెయ్‌దికళిల్ ఒన్ఱై ఎడుత్తురైక్కిఱార్, ఇదిల్.

తిరుమలైయి త్తొల్లైకళిల్ ఇరాక్కాలఙ్గళిల్ యానై పట్టిమేయ, అదనై త్తురత్తువదఱ్కాక అమ్బు తొడుత్త విల్లై ఒరు కైయిల్ కొణ్డ కుఱవర్కళ్ మఱ్ఱొరు కైయిలే తీవట్టియై



క్కొళుత్తి ప్పిడిత్తుక్కొణ్డు అదట్టి చ్చెల్ల, అత్తీవట్టియైయుమ్, అమ్బు కోత్త విల్లైయుమ్ కణ్డ అక్కళిఱు అఞ్జి ఓడిప్పోక, అకస్మాత్తాక ఆకాశత్తిల్ నిన్ఱుమ్ నక్షత్తిరమ్ అవ్వానై పదఱిచ్చెల్లుమ్ వழிయిడైయే వన్దు పెరుఞ్జోతియుడనే విழ, అత్తై క్కణ్డు ఇతు నక్షత్తిర మెన్ఱుణరాతు, "కుఱవర్కళ్ కైత్తీవీట్టియైయే కీழெఱిన్దార్కళ్" ఎన్ఱు భ్రమిత్తు, "ఇవ్వழிయై నామ్ ఎప్పడి కడన్దు శెల్లవల్లోమ్" ఎన్ఱఞ్జి తికైత్తు నిఱ్కుమిడమామ్ అత్తిరుమలై.

అస్థానే భయశఙ్కై పణ్ణుకిఱ యానైయిన్ శెయ్‌దియై క్కూఱినవిదనాల్ అస్థానే భయశఙ్కై పణ్ణి ఎమ్బెరుమానుక్కు మఙ్గళాశాసనమ్ పణ్ణుకిఱ మహాన్‌కళిన్ ఇరుప్పై నినైప్పూట్టినారాక చ్చొన్నలా మెన్బ.

**దివ్యార్థ :– అను :– (పెరువిఙ్బుకழி) "వేఙ్గడమే అశురర్ కోన్ వీழ క్కణ్డుకన్దాన్ కున్ఱు"**
భాగవతవిరోధి అయిన హిరణ్యకశిపుని వధించి, పరమభాగవతుడైన ప్రహ్లాదుని రక్షించిన స్వామి ఆ ఆశ్రితపక్షపాతమనే మహాగుణాన్ని ప్రకటిస్తూ, ఈనాటికి సేవను అనుగ్రహించే చోటు తిరుమల – అని అంటున్నారు. ఆ వేంకటాచలం ఎటువంటిది? అంటే, అచటి విషయాలలో ఒక అంశాన్ని ఉదాహరించి పల్కుతున్నారు.

ఇందులో తిరుమలలోని పొలాలలో (రాత్రివేళ) ఏనుగు పంటను మేస్తున్నపుడు, దానిని తరిమివేయడం కోసం బాణాన్ని సంధించిన వింటిని ఒక చేతిలో ధరించిన కోయలు వేఱొక చేతిలో దివ్విటీని వెలిగించి పట్టుకొని బెదరిస్తూ పోగా, ఆ దివ్విటీని, బాణం సంధించిన వింటిని చూచిన ఆ ఏనుగు భయపడి పారిపోగా, అకస్మాత్తుగా ఆకాశంనుండి నక్షత్రం ఆ ఏనుగు భయపడుతూ పరుగెత్తే దారిలోనే గొప్ప ప్రకాశంతో కిందపడగా, దానిని చూచి ఇది నక్షత్రం అని తెలియక, కోయలు చేతిలోని దివ్విటీని విసరివేశారని భ్రమించి, ఆ దారిలో మనం ఇక ఎపుడూ వెళ్ళకూడదని నిశ్చయించుకొని భయపడే చోటు ఈ తిరుమల.

అస్థానే భయశంకను పొందిన ఏనుగు వృత్తాంతం చెప్పడంద్వారా అస్థానే భయశంకను పొంది, భగవానునకు మంగళాశాసనం చేసే మహాత్ముల స్థితిని (ఆళ్వార్లు) స్మరింపచేశారని చెప్పవచ్చు.

**(41) కున్ఱనైయ కుఱ్ఱమ్ శెయినుమ్ కుణమ్ కొళ్ళుమ్,**
**ఇన్ఱు ముదలాక వెన్నెఞ్జే, – ఎన్ఱుమ్**
**పుఱనురైయే యాయినుమ్ పొన్నాழிక్కైయాన్,**
**తిఱనురైయే శిన్దిత్తిరు**

ఎన్ = నాయొక్క , నెఞ్జే = మనసా! ఇన్ఱు ముదలాక=ఇప్పటినుండి, ఎన్ఱుమ్ = ఎల్లప్పుడును పుఱన్ ఉరైయే ఆయినుమ్ = బయటకు పల్కు మాటయే అయినను, పొన్ ఆழி కైయాన్

తిఅన్ ఉరైయే = అందమైన చక్రమును చేతిలో ధరించిన భగవానుని విషయమున మాటయే, శిన్దిత్తు ఇరు = తలచియుండుము, (ఇట్లున్నచో) కున్ఱు అనైయ = కొండఅంత పెద్దది అగు, కుగ్ఱమ్ శెయినుమ్ = పాపములను చేసినను, కుణమ్ కొళ్ళుమ్ = (వానిని చూడకుండ భగవానుడు) గుణములనే మనస్సులో గ్రహించును.

**అవతారిక :–** ఇట్లు అతడు దాసుల విరోధులను నశింపజేయుటయే స్వభావముగా కలవాడైనను, దోషములనే రూపముగా కల మనకు అతనిని చేరుట సాధ్యమా! – అని ఆళ్వార్ల మనస్సు భీతి చెందగా, "నీకు అతనిపట్ల అభినివేశము మాత్రమే ఉన్నను, అతడు మన దోషములను అన్నిటిని గుణములుగానే గ్రహించును. భయపడవలసిన పని లేదు సుమా!." అనుచున్నారు.

**వ్యాఖ్య :– (ఎన్ నెఞ్జే)** – నేను ఒకటి చెప్పినచో నీ వొకటి చేయకుండ, నాకు విధేయమైయున్న మనస్సా!

**(ఎన్ఱుమ్ పుఅనురైయే యాయినుమ్) –** నీవు చెప్పు మాటలు ఎల్లప్పుడు మనసార పల్కునవి కాకుండ, **"పొయ్యే కైమ్మై శొల్లి పుఅమే పుఅమే యాడి"** (తిరువాయ్–5–1–1) అను రీతిలో అసత్యమే పల్కినను, అతని విషయములో వార్తలను తలంతువు.

**(పొన్నాఴిక్కైయాన్)** నీవు అసత్యభాషణముగా పల్కినను దానిని నిజమును చేయగల్గిన బంగారువలె ఆశపడదగిన సుదర్శనము కదా అతనితో కూడియున్నది.

**(పొన్నాఴి క్కైయాన్ తిఅ నురైయే)** – అందమైన చక్రమును కలవాని విషయములోని మాటనే అని అర్థము లేక, అందమైన చక్రముచే అనుగ్రహింపబడినది అగు **"మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన, దోషో యద్యపి తస్య స్యాత్ సతా మేత దగర్హితమ్"** (రా.యు–18–3) (మిత్రుడను వేషముతో వచ్చి ఆశ్రయించినను, నేను ఎపుడైనను అతనిని విడువను. అతనికి దోషమున్నను ఉండ నిమ్ము. మంచివారికి ఇది గర్హింపతగినది కాదు.) అను స్థిరమైన మాటనే చింతించుచుండుము – అనియును అర్థము.

**(శిన్దిత్తు ఇరు)** – ఈ వార్తనే అనుసంధించుచు **"స్థితో ఽస్మి గతసందేహః"** (భ.గీ–18–73) (సందేహము తీరినవాడనైయున్నాను) అనునట్లు దుఃఖమును తీరినదానవై యుందువుగాక!

**(ఇన్ఱు ముదలాక)** – ఇట్లు అతని విషయములో నీకు కొంచెము అభినివేశము కల ఈనాటినుండి అతడు **"మిత్రభావేన సంప్రాప్తమ్"** అను శ్లోకము క్రమములోనే నడచుకొనును. అది ఏమి? అనగా –

**(కున్ఱనైయ కుగ్ఱమ్ శెయినుమ్ కుణమ్ కొళ్ళుమ్)** – తన ప్రయత్నముతో కదుపుటకు వీలురానిది అగుటచే, (అవిచాల్యమైనది అగుటచే) కొండవలె ఉన్న గొప్ప



పాపములను చేసినను, వానిని గుణముగా స్వీకరించువాడు. "దోషము ఉన్నను ఉండ నిమ్ము. మంచివారికిది నిందింపతగినది కాదు". తెలియక అఱకొఱగా చేసిన పాపము కాదు. మనః పూర్వకముగానే, పరిపూర్ణముగా పాపములను చేసినను,

**(కుణమ్ కొళ్ళుమ్)–"శెయ్దారేల్ నన్ఱు శెయ్దార్"–** (పెరియాళ్వార్ –4–9–2) అని పల్కు మహావాత్సల్యమును కలవాడగుటచే చేసిన దోషమున గుణముగానే గ్రహించువాడు.

**(కుగ్ఱమ్ శెయినుమ్ కుణమ్ కొళ్ళుమ్)** – పర్వతము అంత దోషములను చేసినను, దానిని గమనింపకుండ అవగింజ అంత పరిమాణమును కల అతిసూక్ష్మమైన గుణముకూడ గొప్పగా గ్రహించువాడు – అనియును చెప్పవచ్చును.

**పెరియ :– నాఱ్పత్తోరామ్బాట్టు. (కున్ఱనైయ) అవన్ కుగ్ఱమ్ పొఱుక్కైక్కాక త్తిరుమలైయిలే వన్దు నిన్ఱాన్. అభిముఖ్యత్తై పణ్ణినాలుమ్ దోషాంశత్తై ప్పారాతే గుణాంశత్తై క్కొళ్ళుమ్. అవనుళ్ళవన్ఱే ఇవ్వాత్మా ఉఙ్జీవిక్కిఱార్. ఇత్తనైనాళుమ్ ఇత్తై చ్చెయ్యాతొఴివాన్ ఎన్నిల్.**

**(ఇన్ఱు ముతలాక) ఇవనుక్కే స్వభావ మెన్ఱతిన్ద ఇన్ఱు తొడక్కమాక.**

**(ఎన్నెఞ్జే) ఎనక్కు హితమ్ పార్క్కుమ్ నెఞ్జే! సహృదయాక అవన్ గుణఙ్గళై ప్పేశప్పోమో? ఎన్నిల్.**

**(పుఅనురైయే యాయినుమ్) అహృదయమాన పేచ్చేయాకిలుమ్. ప్రయోజనమిన్ఱికే అనర్థమాయిగ్గ్రాకిలు మెన్ఱుమామ్.**

**(పొన్నాఴి యిత్యాది) సర్వేశ్వరన్తిఅత్తిల్ శబ్దఙ్గళైయే యతిన్ఱు.**

**(శిన్దిత్తిరు) కృతార్థమా యిరు. అవనోడే సమ్బన్ధముణ్డాకిలుమ్ మున్బు అఙ్గన్శెయ్తరుళావిడువాన్ ఎన్నిల్, కుగ్ఱమ్ గుణమ్ ఎన్ఱు నినైయామై.**

**(పొన్నాఴి) తానే సహృదయమాక్కుమ్.**

**అరు :– నాఱ్పత్తోరామ్బాట్టు. కుగ్ఱమ్ పొఱుక్కై స్వభావమెన్ఱతిన్ద ఇన్ఱు ఎన్ఱపడి.**

***నమ్బిళ్ళై :– నాఱ్పత్తొన్ఱామ్పాట్టు:– ఇప్పడిప్పట్ట బన్ధమ్ ఉణ్డేయాకిలుమ్ కుగ్ఱవాళరాన నమక్కు అవనోడు శెల్లవేణుమో! ఎన్న, "అవన్ కుగ్ఱమ్ పొఱుక్కైక్కాకవే వన్దు నిన్ఱాన్. నమక్కు ఒరు కృత్యముమ్ ఇల్లై. ఇని, నీ ఆభిముఖ్యత్తై పణ్ణి, అవనై అనుభవిత్తిరుప్పార్" – ఎన్ఱు తమ్ తిరువుళ్ళత్తై క్కుఱిత్తు అరుళిచ్చెయ్కిఱార్.***

***(కున్ఱు అనైయ కుగ్ఱమ్ శెయ్యినుమ్) "మేరుమన్దరమాత్రోఽపి" ఎన్గిఅపడియే ఒరుమలై యత్తనై పాపమ్ పణ్ణువదు. పెరుమైక్కుమ్, పొక్కవొణ్ణామైక్కుమ్ మలైయై ఒప్పాక చ్చొల్లుకిఅదు. అనుభవవినాశ్యమాయల్లదు తీరామై. అవన్ "పొఱుత్తోమ్" –***

ఎన్నప్పో మిత్తనై.

*(కుణమ్ కొళ్ళుమ్)* అవన్ సుకృతమడియాక ఏదేనుమ్ ఒరు నన్మై కలశి వన్దదు ఉణ్డాకిల్, అత్తై అన్ద మలైయోడొక్క నినైత్తిరుక్కుమ్ - ఎన్నుదల్. అన్ఱిక్కే, కుఱ్ఱజ్గళ్యాత్తైయుమ్ మఱన్దు, ఇరున్ద కుణమ్ ఒన్ఱైయుమ్ స్వీకరిక్కుమ్ - ఎన్నుదల్. అతావతు - "శెయ్దారేల్ నన్ఱు శెయ్దార్" ఎన్నుమ్ అవన్ ఉళ్ళవన్ఱే ఇవ్వాత్మావుమ్ ఉళ్ళదొన్ఱు. ఇత్తనైనాళుమ్ ఇత్తై పెఱాతొఴిివానేన్? ఎన్నిల్.

*(ఇన్ఱు ముదలాక)* - సర్వేశ్వరనుక్కు ఇప్పడి యిరుప్పదొరు స్వభావమ్ ఉణ్డు ఎన్నుమ్, ఇవ్వారాయ్చ్చి యునక్కు ప్పిఱన్ద ఇన్ఱు తొడజ్గి ఎన్నై యున్ వఴియాక్కుకై తవిర్న్దు నీ ఎన్ వఴియే నిఱ్కప్పెఱువతే! సహృదయమాక అవనుడైయ గుణజ్గళై ప్పేశప్పోమో! ఎన్నిల్.

*(ఎన్ఱుమ్ పుఱనురైయే ఆయినుమ్)* - అహృదయమాన శొల్లాలే యాకిలుమ్, ప్రయోజనమ్ ఇన్ఱిక్కే అనర్థమాక తుదిత్తాకిలుమామ్. *"వృథైవ భవతో యాతా భూయసీ జన్మసంతతిః, తస్యాన్యతమం జన్మ సంచిత్య శరణం వ్రజ".*

*(పొన్నాఴిక్కైయాన్)* - కణ్డాయే! ఇవ్విషయమ్ ఇరున్దపడియాల్ మఱక్కలాయిరున్దదో! నీ ఏదేనుమ్ ఒరుపడి యిరున్దాలుమ్ సహృదయమాక పుణ్ణువిత్తుక్కొళ్ళవఱ్ఱాయ్ క్కాణ్, అవ్విషయమ్ ఇరుప్పతు.

*(తిఱన్ ఉరైయే శిన్దిత్తిరు)* - అవనిడైయాట్టమానవఱ్ఱైయే అనుసంధిత్తు నిర్భయమాయ్ క్కొణ్డు ఇరు. అజ్గన్ అన్ఱిక్కే, పుఱనురైయే యాకిలుమ్ ఉనక్కుఴుకితాక శెయ్యప్పార్ - ఎన్గిఱారాకవుమామ్. అవనుడైయ తిఱమాన పుఱనురై యుణ్డు. అవన్ "మా శుచః" ఎన్ఱు శొన్న శొల్లు. అత్తై యనుసంధిత్తు "స్థితోఽస్మి" ఎన్గిఱపడియే సుఖమే యిరుక్కప్పారాయ్ - ఎన్గిఱార్.

*(తిఱనురై)* - *"మిత్రభావేన", "మాతవన్ ఎన్దదేకొణ్డు".*

అప్పిళ్ళై:-అవ:-నాఱ్పత్తోరామ్పాట్టు. "ఇప్పడి అవనాశ్రితవిరోధినిరసనశీలనాకిలుమ్ దోషమే వేషమాన నమక్కవనై చ్చెన్ఱణుకప్పోమో" ఎన్ఱు తిరువుళ్ళమ్ భయప్పడ, "ఉనక్కాభిముఖ్యమ్మాత్ర ముణ్డాకవే అవన్ నజ్గుఱ్ఱత్తైయడైయ, నఱ్ఱమాక క్కొళ్ళుమ్, ఆజ్ఞవేణ్డా" - ఎన్గిఱార్.

ఎన్ నెఞ్జే - ఎన్వఴియే యొఴుకుమ్పడి ఎనక్కు ప్పాజ్ఞాన నెఞ్జే! ఎన్ఱుమ్ - సర్వకాలత్తిలుమ్, పుఱనురైయేయాయినుమ్ - సహృదయమాక అన్ఱిక్కే కేవలమ్ వాఙ్మాత్రసిద్ధమాన పుఱప్పేచ్చాలేయాకిలుమ్, పొన్నాఴి క్కైయాన్ -



అహృదయోక్తికళైయుమ్ సహృదయమామ్పడి పణ్ణవఱ్ఱాన అఴకియ తిరువాఴియుమ్, కైయుమాన శేర్త్తియఴకై యుడైయ సర్వేశ్వరనిడైయాట్టమాయ్, తిఱనురైయే - మిత్రభావ మడియాక "న త్యజేయమ్" ఎన్నుమ్పడియాన శొల్లైయే, శిన్దిత్తు - అనుసన్ధిత్తుక్కొణ్డు, ఇరు - "స్థితోఽస్మి" ఎన్నుమ్పడి నిర్భయమాయ్ క్కొణ్డిరు; ఇన్ఱు ముతలాక - ఇవ్వానుకూల్యలేశ ముణ్డాన విన్ఱు ముతలాక, కున్ఱనైయ - మలైపోలే స్వయత్నత్తాల్ చలిప్పిక్కవొణ్ణాతపడి పరుత్తుత్తెన్దిరుక్కిఱ, కుఱ్ఱమ్ - కుఱ్ఱజ్గళై, శెయినుమ్ - పత్తుమ్ పత్తాక చ్చెయ్తాలుమ్, అతిమాత్రవత్సలనానవన్, కుణఙ్గొళ్ళుమ్ - "శెయ్తారేల్ నన్ఱు శెయ్తార్" ఎన్నుమ్పడి గుణమాక క్కొళ్ళుమ్.

దివ్యార్థ:-(కున్ఱనైయ కుఱ్ఱమ్) - ఎమ్బెరుమానుడైయ వాత్సల్యగుణత్తి లీడుపట్టి ప్పేశుకిఱార్. "నెఞ్జే! ఆంతరికమాన అన్బిన్ మికుతియినాలే శొఱ్కళై త్తొడుత్తు ఎమ్బెరుమానై త్తుదిప్పార్ పల రుణ్డు. అప్పడిప్పట్ట అన్బు నమక్కు ఇల్లామైయినాల్ కఴుత్తుక్కు మేల్పడవే శిల శొఱ్కళైనామ్ కపటమాక చ్చొల్లవల్లోమ్. అప్పడి మేలుక్కు చ్చొల్లుకిఱ వార్త్తైయా యిరున్దాలుమ్ అతు భగవానై ప్పఱ్ఱిన వార్త్తైయాక ఇరున్దువిడుమాయిన్ పయన్పడుమ్. ఎమ్బెరుమాన్ "మిత్రభావేన సంప్రాప్తమ్ న త్యజేయం కథంచన" (ప్రీతియై భావనైశెయ్దు వరుబవనైయుమ్ కైవిడమాట్టేన్ - ఎన్ఱు శొన్నవనాకైయాలే నామ్ మేలుక్కు చ్చొల్లుకిఱ వార్త్తైయైయుమ్, అవన్ కనత్తతాక త్తిరువుళ్ళమ్బఱ్ఱి త్తన్నుడైయ వాత్సల్యగుణత్తై నమ్మేల్ ఏఱి ప్పాయవిడువన్. నామ్ మలైమలైయాక కుఱ్ఱజ్గళ్ శెయ్దాలుమ్ "ఎన్నడియా రతు శెయ్యార్ శెయ్దారేల్ నన్ఱు శెయ్దార్" (పెరియాఴ్వార్ తిరు-4-9-2) ఎన్నుమవనుడైయ తిరువుళ్ళత్తిల్ అవై ఎల్లామ్ నఱ్ఱమాకవే పడుమ్. అవన్ నమదు ఆభిముఖ్యత్తై మాత్తిరమే ఎదిర్పార్ప్పవనాదలాల్ నామ్ మేలుక్కు చ్చొల్లుమ్ వార్త్తైయుమ్ అవనుక్కు కార్యోపయోగియాక ఆయ్విడుజ్కాణ్" - ఎన్గారాయిఱ్ఱు.

శ్రీవైకుంఠత్తిలే ఎమ్బెరుమాన్ నిత్యర్కళోడుమ్, ముక్తర్కళోడుమ్ కూడి పరిపూర్ణా నుభవమ్ పెఱానిఱ్కచ్చెయ్దేయుమ్, అదనాల్ ఎమ్బెరుమాన్ శిఱిదుమ్ మకిఴ్వాదు, పల పిళ్ళైకళై ప్పెఱ్ఱ ఒరు తకప్పనార్ ఒరు మకన్ మాత్తిరమ్ దేశాన్తరత్తిలిరుక్క మఱ్ఱ ఎల్లా పుత్తిరర్కళోడుమ్ కూడి వాఴానిన్ఱాలుమ్, అదనాల్ మకిఴ్చ్చి యడైయామల్ దేశాన్తరత్తిలుళ్ళ పుత్తిరనదు పిరివైయే నినైత్తు ప్పరితపిక్కుమాపోలే, ఎమ్బెరుమానుమ్ సంసారికళాన అస్మదాదికళిన్ పిరివైయే నినైత్తు ప్పరితాప ముఱ్ఱు, నమ్మోదే కలన్దు పరిమాఱువదఱ్కాక కరణకళేబరజ్గళై నమక్కు త్తన్దరుళి, అవఱ్ఱై క్కణ్డు నామ్ కారియమ్ శెయ్యుమ్పడియాన శక్తివిశేషజ్గళైయుమ్ నమక్కు క్కొడుత్తు, మికవుమ్ అహంకారికళాన

నమ్మెదిరిల్ తాన్ ప్రత్యక్షమాక వన్దు నిన్టాల్ నామ్ పొఱామై కొణ్డు అణై యిట్టాకిలుమ్ త్తన్నై త్తురత్తివిడువో మెన్టెణ్ణి, ఒరువర్ కణ్ణుక్కు న్తోగ్ర్ఱాదపడి, ఉఱఙ్గుకిఱ కుఴన్దైయై త్తాయానవళ్ ముదుకిలే అణైత్తు క్కొణ్డు కిడైక్కుమాపోలే, ఎమ్బెరుమాన్టాలుమ్ తా నతిన్ద సమ్బన్ధమే కారణమాక నమ్మై విడమాట్టామల్ అంతర్యామియా యిరున్దు తొడర్న్దు కొణ్డు నమ్మై ఒరుకాలుమ్ కైవిడామల్, సత్తైయే నోక్కిక్కొణ్డు నమక్కు త్తుణైయాయ్ ప్పోరుమళవిల్, నామ్ కెట్ట కారియఙ్గళిలే కైవైత్తోమాకిల్ నమ్మై త్తిరుప్పమాట్టామల్ అనుమతి పణ్ణి ఉదాసీనరరైప్పోలే యిరున్దు, తిరుప్పుకైక్కు ఇడమ్ పార్త్తుక్కొణ్డేయిరున్దు, నామ్ శెయ్కిఱ తీమైకళిలే ఏదేను మొరు తీమైయావతు (విషయప్రవణనాయ్ వేశికళైప్పిన్ తొడర్న్దు అడిక్కడి కోవిల్కళిలే నుఴైన్దు పుఱప్పడుకై, వయలిల్ పట్టిమేయ్న్దు పశువై అడిప్పదాక త్తురత్తిక్కొణ్డు పోమ్బోదు అదు ఒరు కోవిలై ప్రదక్షిణమ్ పణ్ణిక్కొణ్డు ఓడుకిఱవళవిలే అదై విడమాట్టాద ఆగ్రహత్తాలే తానుమ్ అక్కోవిలై మున్శెయ్కై, (శిశుపాలాదికళైప్పోలే) నిన్దై శెయ్వదఱ్కాక త్తిరునామఙ్గళై చ్చొల్లుకై – ముదలియన) నన్మై యెన్టు పేరిడ క్కుడిపిడిత్తు, “ఎన్ఊరై చ్చొన్నాయ్, ఎన్పేరై చ్చొన్నాయ్” ఎన్టిప్పడి శిల సుకృతఙ్గళై యేఱిట్టు, మడిమాఙ్గాయిట్టు, కారియమ్ శెయ్కిఱానెన్టు ఇతిహాసపురాణఙ్గళిలే కాణానిన్టోమాకైయాలే, ఇప్పడి అనుగ్రహిప్పదఱ్కు చ్చిఱిదు వ్యాజమాత్తిరత్తై ఎతిర్పార్త్తు త్తిరికిన్ట ఎమ్బెరుమానుడైయ తిరువుళ్ళత్తుక్కు ఇయైయ – “పుఱనురైయే యాయినుమ్ పొన్నాఴిక్కైయాన్ తిఱనురైయే శిన్దిత్తిరు” ఎన్టరుళిచ్చెయ్దారిఙ్గు.

“కున్టనైయ కుగ్ఱమ్శెయ్యినుమ్ కుణఙ్కొళ్ళుమ్” ఎన్ట ముదలడిక్కు ఇరణ్డువకైయాక పొరుళ్ ఉరైప్పర్. 1.నామ్ మలైమలైయాక క్కుగ్ఱఙ్గళ్ శెయ్దాలుమ్, ఎమ్బెరుమాన్ అవగ్ఱిల్ తిరుక్కణ్ శెలుత్తామల్ కుణమాక ఉళ్ళవగ్ఱైయే కణ్డుకొళ్బన్ – ఎన్బదాక ఒరు పొరుళ్. నామ్ మలైమలైయాక క్కుగ్ఱఙ్గళ్ శెయ్దాలుమ్ అవగ్ఱై యెల్లామ్ తాన్ కుణమాక క్కొళ్బన్. (అతావతు) భోగ్యమాక క్కొళ్వన్ – ఎన్బదాక మగ్ఱొరు పొరుళ్. ఇవగ్ఱిల్, ముదఱ్పొరుళై విడ ఇరణ్డామ్ పొరుళ్ శిఱక్కుమ్. కుగ్ఱఙ్గళిల్ కణ్ శెలుత్తామల్ కుణమాక వుళ్ళత్తైయే కొళ్ళుకిన్టాన్ ఎన్నుమ్ పొరుళిల్ నమ్మిడత్తిల్ గుణఙ్గళుమ్ శిల ఉణ్డెన్టు వెళియిట్టపడియాకుమ్. “అకృతసుకృతక స్సుదుష్కృత్తరః వరద మురుదయం గతిం త్వాం వృణే” – (వరదరాజస్తవమ్-92) ఎన్టాఱ్పోలే, కుగ్ఱఙ్గళే కూడుపూరిత్తిరుప్ప తాకవుమ్, గుణమెన్బదు లవలేశము మిల్లైయాకవుమ్ అనుసన్ధిత్తుక్కొళ్ళుమ్ పెరియోర్కళిన్ కరుత్తుక్కిణఙ్గ “కుగ్ఱఙ్గళై యెల్లామ్ కుణమాక క్కొళ్వన్” ఎన్నుమ్ పొరుళ్ మిక చ్చిఱక్కుమ్.

కుగ్ఱఙ్గళై నగ్ఱమాక క్కొళ్వనెన్టు మిప్పొరుళిన్ సారస్యత్తై ప్పగ్ఱి చ్చిల



శొల్లవేణ్డియ దుణ్డు. కేణ్మిన్. ఇవ్వులకిన్ “మదివికఱ్పార్ పిణఙ్గమ్ శమయఙ్గళ్” పల పల వుణ్డు. “ఎమ్బెరుమానే ఇల్లై” – ఎన్గిఱ బాహ్యసమయికళుమ్; ఎమ్బెరుమానొరువనుణ్డె న్టిశైన్దు, అవనుక్కు క్కుణ మిల్లై – ఎన్గిఱ (నిర్గుణబ్రహ్మవాదికళాన) కుదృష్టికళుమ్ ఏఱ్పట్టిరుప్పదుపోలవే; ఎమ్బెరుమానైయుమ్, అవనుక్కు కుణఙ్గళైయుమ్ ఇశైన్దు వైత్తు, “ఆనాల్ అక్కుణఙ్గళ్ ఓర్ ఎల్లైయుడైయన” ఎన్నుమ్ కొళ్కైయుడైయారుమ్ శిల రుణ్డు. “ఉయర్వఱ ఉయర్నల ముడైయవన్” ఎన్టరుళిచ్చెయ్ద ఆఴ్వారైయుమ్, “అనవధికాతిశయాసంఖ్యేయకల్యాణగుణగణౌఘమహార్ణవ” ఎన్టరుళిచ్చెయ్ద ఎమ్బెరుమానారైయుమ్ వఴిపడుకిన్ట సాత్త్వికర్కళిన్ సిద్ధాంతమ్–“ఎమ్బెరుమానుడైయ తిరుక్కుణఙ్గళిన్ అతిశయత్తుక్కు ఎల్లై యిల్లై” ఎన్బదేయామ్. ఎమ్బెరుమానదు ఎణ్ణిఱన్ద గుణఙ్గళుళ్ వాత్సల్యమ్ ఎన్బదు ఒన్టు. (అడియార్కళిన్) కుగ్ఱఙ్గళై క్కాణాతిరుక్కైయే వాత్సల్యమెన్టు శిలరదు కొళ్గై. అఙ్గనన్టియే, “దోషఙ్గళైయుమ్ భోగ్యమాక క్కొళ్ళుతలే వాత్సల్యమ్” ఎన్బదు సత్సప్రదాయసిద్ధాంతమ్. ఇఙ్గనే పొరుళాకిల్, శాస్త్రార్థఙ్గళ్ వ్యాకులఙ్గళాయ్ విడు మెన్టు ప్రతిపక్షికళ్ పకర్వతుణ్డు. అ:తు ఎమ్బెరుమానుడైయ గుణత్తిఱ్కు క్కుఱై కూఱినపడియా మత్తనై. అడియార్కళుడైయ దోషఙ్గళై క్కణ్డు వెఱుప్పుక్కొళ్ళాతే, అవర్కళై క్కైక్కొళ్వదఱ్కు అన్ద దోషఙ్గళైయే పచ్చై (ఉపహారమ్) యాక్కుకై – వాత్సల్యమ్ ఎన్నుమ్ సత్సంప్రదాయ ప్పొరుళిల్ కుఱై ఇఱైయు మిల్లై. “దోషఙ్గళై భోగ్యమాక క్కొళ్వదెన్బదు కుణమా? అన్టా?” ఎన్టు పొదువాక క్కేట్కిఱోమ్. ఎమ్బెరుమాన్విషయత్తిలే ఇక్కేళ్వి కేట్కిఱో మెన్టు కొళ్ళామల్ సామాన్యమాక క్కేట్కిఱో మెన్టుకొణ్డు విడై యళిక్కవేణుమ్. “సంబంధవిశేషాన్వితేషు ప్రీతిః స్నేహః, యస్య విపాకాః అస్థానభయశంకిత్వమ్, దోషానవభాసః, దోషేఽపి గుణత్వబుద్ధి రిత్యాదయః” (ఉఱవినర్కళిడత్తు వైక్కుమ్ అన్బుక్కు ప్పల పరిపాకఙ్గళుణ్డు. అవై యావన – కారణ మిన్టియే భయత్తై శఙ్కిప్పతు, దోషమ్ తోగ్ఱాదిరుక్కై , దోషత్తైయుమ్ కుణమాక క్కొళ్ళుకై–ముదలియన) ఎన్టు శ్రుతప్రకాశికైయిలే అరుళిచ్చెయ్దిరుక్కైయాలే కుగ్ఱఙ్గళైయుమ్ నగ్ఱమాక క్కొళ్ళుకై ఎన్బదు శిఱన్ద కుణమేయామ్ – ఎన్నవేణుమే యన్టి, కుణ మెన్టు ఎణ్ణ వొణ్ణాతు. “వాత్సల్యం నామ దోషే షఽపి గుణత్వబుద్ధిః” ఎన్టు సమన్వయాధికరణశ్రుతప్రకాశియిలు ముళ్ళతు. ఆకవే, కుణమెన్టు ఏఱ్పడుకిఱ ఇతు ఎమ్బెరుమానుక్కు ఇల్లై యెన్టాల్, అవనుక్కు ఒరు కుణమ్ కున్టియతాకిఱతు. అప్పోతు, భగవద్గుణఙ్గళుక్కు ఇట్ట “ఉయర్వఱ వుయర్” ఎన్ట విశేషణముమ్, “అనవధికాతిశయ” ఎన్ట విశేషణముమ్ పఴుతేయామ్.

ఉణ్మైయిల్ దోషమానవగ్ఱై కుణమెన్టు గ్రహిత్తాల్, ఇదు భ్రాంతిజ్ఞానమాకైయాలే ఎమ్బెరుమానై భ్రాంత నెన్టు శొన్నపడియాకాతో! ఎన్నిల్, ప్రేమత్తిన్ కనత్తాలే వరుమ్

భ్రమమెల్లామ్ అడిక్కళ్తుఙ్జుపెఱుమ్. (అడిక్కళ్తుఙ్జుపెఱు మెన్డతు – ఉత్తమోత్తమ మెన్డపడి). “ఉలక మడఙ్గలుమ్ ఎనక్కు శరీరమ్, నా నొరువనే శరీరి” ఎన్ఱురైత్త పెరుమాన్తానే అదఱ్కు మురణాక “జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్” ఎన్ఱు గీతైయిలరుళిచ్చెయ్దానే! ఇదనైయుమ్ ప్రమాణమెన్న వేణ్డావో! తూప్పులమ్మాన్ అరుళిచ్చెయ్త విరోధపరిహారరహస్యత్తిలే – “సర్వశేషియాన సర్వేశ్వరన్ ఆశ్రితర్కళై ప్పఱ్ఱ శేషమాయిరుక్కు మిరుప్పు గుణకృతమాయ్, ప్రీత్యతిశయహేతు వాకైయాలే దోష మన్ఱు” ఎన్ఱుళ్ళదు కణ్డీర్కళో? “ఉన్నదెన్నదావియుమ్ ఎన్నతున్నతావియుమ్” (తిరువాయ్మొళ్ళి–5–3–8) ఎన్నవిడత్తుక్కు ఆళవన్దారరుళిచ్చెయ్యు మతు అఱివీర్కళో? సర్వరక్షకనాన ఎమ్బెరుమానై రక్ష్యకోటియిలే యాక్కి మఙ్గళాశాసనమ్ పణ్ణువతుమ్ భ్రాంతికార్య మెన్ఱిట్టు దూషిక్కప్పడవేణుమే! నోన్బు నోత్తు, కామన్ కాలిలే విళ్తుకై, మడలూర్వేనెన్ఱై – ముదలియ ప్రపన్నసంతానప్రవృత్తికళైయుమ్ భ్రాంతికార్య మెన్ఱుకొణ్డు ఆళ్వార్కళైయుమ్ ఇకళ్తవేణుమే. “ఆఙ్గారవార మతు కేట్టు అళ్త లుమిళ్తుమ్ పూఙ్గారరవు” (నాన్ముకన్ తిరు–10), “స్నేహాదస్థానరక్ష్యావ్యసనిభి రభయం శార్ఙ్గచక్రాసిముఖ్యైః” ఇత్యాదిప్పడియే “నల్లమన్దమిల్లదోర్ నాట్టి” లుఙ్గాద ఇరుళ్తరుమాఞాలత్తిఱ్పోల భయశంకై పణ్ణి కలఙ్గుకిన్ఱ అయర్వఱు మమరర్కళైయుమ్ “అఱివిలా మనిశ” రోడొక్క నినైక్కవేణుమే!

“సౌశీల్యం నామ మందజనసంశ్లేషదశాయాం స్వమహత్త్వబుద్ధిరాహిత్యమ్” (సౌశీల్యగుణమావతు–మన్దజనఙ్గళోడు తాన్ కలన్దు పరిమాఱుమ్బోదు తాన్ మిక ప్పెరియవన్ ఎన్గిఱ ఎణ్ణత్తై త్తవిర్త్తుక్కొళ్ళుకై) ఎన్ఱు శ్రీమద్వేదాంతదేశికన్ అరుళిచ్చెయ్కిఱార్. ఎమ్బెరుమాన్ “మహతో మహీయాన్” ఎన్నప్పట్ట తన్నై మన్దనిలుమ్ కడైకెట్ట మన్దనాక నినైత్తుక్కొళ్వతు ఎఙ్గనేకొల్ పొరున్దువతు?

“జ్ఞానవిపాకకార్యమాన అజ్ఞానత్తాలే వరుమవైయెల్లామ్ అడిక్కళ్తుఙ్జుపెఱుమ్” ఎన్ఱ శ్రీవచనభూషణశ్రీసూక్తిక్కు ఇశైన్దు, కీళ్చ్చొన్న విషయఙ్గళై యెల్లామ్ ఉపపన్న మెన్నుమ్బోదు, ఇక్కణక్కిలేదానే “దోషేషు గుణత్వబుద్ధిః” ఎన్గిఱ ప్రకృతవిషయత్తైయుమ్ పొరున్దవిడ ప్రాప్తమ్.

అమరసింహన్ తాన్ ఇయఱ్ఱియ కోశత్తిలే “స్నిగ్ధ స్తు వత్సలః – “వత్సలనెన్ఱాల్ స్నేహముడైయవన్” ఎన్ఱానే యన్ఱి, “భ్రాంత స్తు వత్సలః” – “భ్రమ ముళ్ళవన్ వత్సలన్” ఎన్ఱానిల్లై – ఎన్ఱొరుకోటి శొన్నార్కళ్, శిలర్. కుఱ్ఱత్తై నఱ్ఱమాక క్కొళ్ళుకై – యెన్గిఱ గుణత్వజ్ఞానమ్ స్నేహవిపాకమ్. (అతావతు) అన్బు ముఱ్ఱిన అవస్థై – ఎన్ఱు శ్రుతప్రకాశికైయిల్ అరుళిచ్చెయ్దిరుక్కైయాలే పరమకాష్ఠాపన్న (ముదిర్న్ద ఎల్లైయిల్ నిన్ఱ) స్నేహమేయితే వాత్సల్యమావతు. ఆకైయాలే, అమరసింహన్ శొన్నతు పొరుత్తముడైత్తే. “స్నేహోద్రేకాయదశాపరావధితయా దోషే గుణత్వగ్రహో వ్యాజహ్రే హి



సుదర్శనార్యగురుభిః శ్రీభాష్యటీకాకృతౌ, ఏవం చామరసింహకోశపఠితం స్నిగ్ధత్వవాత్సల్యయోః పర్యాయత్వ మవద్యగంధవిధురం సంజాఘటీతి స్ఫుటమ్” ఎన్ఱు సంప్రదాయసిద్ధాంజనత్తిలుమ్ శొన్నోమ్.

దోషత్వత్తిల్ దోషత్వ మెన్గిఱ తన్మై ఎప్పోదుమ్ తోఱ్ఱిక్కొణ్డే యిరుక్క, దోషత్తై క్కణ్డు కుణ మెన్ఱు గ్రహిప్పతు ఎమ్బెరుమానుడైయ సర్వజ్ఞత్తైక్కుమ్, తత్వజ్ఞత్తైక్కుమ్ కొత్తైయామ్ – ఎన్ఱు ఒరు కోటి శొల్లువర్కళ్. అన్ఱో! “దోషత్తై క్కాణాదిరుక్కై వాత్సల్యమ్” ఎన్నుమ్ కొళ్కైయుడైయార్ తాముమ్ ఇన్ద దూషణత్తిఱ్కు ప్పరిహారమ్ పణ్ణి త్తీరవేణుమ్. సర్వజ్ఞనుక్కు అజ్ఞానత్తై అఙ్గీకరిప్పదోడు, అన్యథాజ్ఞానత్తై అఙ్గీకరిప్పదోడు వాశి యిల్లైకిడీర్. ఒరు వస్తువై యుళ్ళపడి అఱియాదవళవిల్, అడియోడు అఱియామైయుమ్ సంశయాత్మావాయ్ తికైన్దు నిఱ్పదుమ్, విపరీతమాక అఱివతుమ్ ఆకియ ఎల్లామ్ తుల్యయోగక్షేమ మెన్బదు వివాదమఱ్ఱ విషయమాదలాల్, ఎమ్బెరుమానై ఇవర్కళ్ అజ్ఞనాక చ్చొల్లువదోడు నామ్ అన్యథాజ్ఞానియాక చ్చొల్లువదోడు, ఒరు వాశి యిల్లైయే. (దోషఙ్గళై క్కాణా నెన్బదు అజ్ఞ నెన్ఱపడి. దోషఙ్గళై గుణమాక క్కొళ్వనెన్బదు అన్యథాజ్ఞానియెన్ఱపడి.

సహస్రనామత్తిల్ “భక్తవత్సలః” ఎన్ఱ తిరునామత్తిఱ్కు భగవద్గుణదర్పణత్తిల్ భాష్యమరుళిచ్చెయ్యానిన్ఱ భట్టర్ – “తల్లాభసంభృతవిస్మృతాన్యకామః – భక్తవత్సలః” (ఓరడియాన్ కిడక్క ప్పెఱ్ఱ పెరుమైయినాల్ మఱ్ఱదొన్ఱిలుమ్ ఆశైకొళ్ళాదు ఎల్లావఱ్ఱైయుమ్ కుఱైన్దిరుక్కై – భక్తవాత్సల్యమ్) – ఎన్ఱార్. ఇన్ద సూక్తికళిన్ శువైయై ఆళ్న్దు అనుభవిప్పార్ యార్? సహస్రనామత్తిల్ “సహస్రాంశుః” ఎన్నచ్చెయ్దేయితే “అవిజ్ఞాతా” ఎన్గిఱతు. (సహస్రాంశుః – సర్వతోముఖమాన జ్ఞానత్తై యుడైయవన్, అవిజ్ఞాతా – అడియార్ శెయ్యుమ్ కుఱ్ఱఙ్గళై అఱియాతవన్) అజ్ఞత్వ – సర్వజ్ఞత్వఙ్గళుక్కు సామానాధికరణ్యత్తై ఇవర్కళ్ నిర్వహిక్కుమ్బోదు అన్యథా జ్ఞాతృత్వత్తై నిర్వహిప్పద్తుతానే అరుమైప్పడుమ్.

ఇఙ్గే సూక్ష్మమాక ఒన్ఱు ఆరాయవేణుమ్. ఎమ్బెరుమాన్ అడియార్కళిన్ దోషఙ్గళై క్కాణ్బతిల్లై – ఎన్గిఱ అర్థముమ్, దోషఙ్గళై భోగ్యమాక క్కొళ్ళుకిఱా నెన్గిఱ అర్థముమ్, ఆక–ఇరణ్డుమ్ నూల్కళిల్ ఉణ్డు. “సహస్రాంశుః” ఎన్ఱ తిరునామత్తిన్ భాష్యత్తిలుమ్, అంతరధికణశ్రుతప్రకాశికైయిలుమ్, మఱ్ఱుమ్ పల విడఙ్గళిలుమ్ దోషాదర్శిత్వోక్తి (కుఱ్ఱఙ్గళై క్కాణాక్కణ్ణిట్టురుక్కిఱా నెన్బదు) కాణలామ్. ఆకైయాలే, ఎమ్బెరుమానుక్కు దోషభోగ్యత్వ మొళ్తియ దోషాదర్శిత్వమే కిడైయాదెన్ఱు సిద్ధాంతికళ్ కూఱుమవరల్లర్. పూర్వపక్షికళో ఎన్నిల్, దోషాదర్శిత్వమాత్తిర మిశైన్దు దోషభోగ్యత్వత్తై మఱుక్కిన్ఱనర్.

ఇరణ్డుక్కుమ్ కుఱైయిల్లా యెన్బర్ సిద్ధాన్తికళ్. దోషాదర్శిత్వముమ్, దోషభోగ్యత్వముమ్ విరుద్ధధర్మఙ్గ ళల్ల. దోషాదర్శిత్వ మెన్బదు ప్రీతియిన్ ప్రథమపర్వ మెన్ఱుమ్, దోషభోగ్యత్వ దోషాదర్శిత్వ మెన్బదు ప్రీతియిన్ చరమపర్వమెన్ఱుమ్ ఆచార్యర్కళ్ తెళియవైత్తార్కళ్. ఎమ్బెరుమాన్ శిలర్పక్కల్ శిలకాలఙ్గళిల్ దోషఙ్గళై క్కాణాదవనాకవుమ్, మఱ్ఱొరుకాల్ అవర్కళ్పక్కలిలేయో, వేఱొరువర్ పక్కలిలేయో దోషఙ్గళై భోగ్యమాక క్కొళ్బవనాకవు ముళన్ – ఎన్గిఱతే సత్సంప్రదాయమ్. ఇదిలే విప్రతిపత్తి పణ్ణిల్, క్షమాగుణముమ్ దోషాదర్శిత్వత్తోడు విరోధిక్కు మెన్నవేణుమ్. దోషఙ్గళై క్కాణ్బదే యిల్లావిడిల్ క్షమిక్క ప్రసక్తితాను మిల్లైయిఱే. "క్షమాకాష్ఠాభూతవాత్సల్యకథనేన క్షమాప్యుక్తా భవతి" ఎన్గిఱారే, గద్యభాష్యత్తిల్ దేశికన్.

ఒరు కుణత్తై క్కొణ్డు మఱ్ఱొరు కుణత్తై క్కణ్ణఴిక్క ప్పార్క్కిల్ పరత్వ మొన్ఱుమే ఓఙ్గి నిన్ఱు, మఱ్ఱ కుణఙ్గళడఙ్గలుమ్ కడల్పుక్కొళిక్కుమ్బడి తర్కకౌశలమ్ కాట్టలాకుమ్. "పిణఙ్గి యమరర్ పిదఱ్ఱుమ్ గుణఙ్గెఴు కొళ్కైయినా" నాకియ ఎమ్బెరుమానుడైయ గుణప్రసరత్తుక్కు క్షుద్రయుక్తికళాలే కణ్ణఴివు శొల్లప్పార్ప్పదు వక్తాక్కళుక్కే దోషమామ్. ఎమ్బెరుమానుడైయ ప్రణయరసమ్ ఇరుకరైయ మఴియ ప్పెరుకప్పుక్కాల్ అణైయిట్టుమ్, అణైయిట్టుమ్ తడుక్కవల్లారిల్లై కిడీర్! శాస్త్రఙ్గళెల్లామ్ ఒరుతట్టుమ్, అవనుడైయ కల్యాణగుణప్రసరమ్ ఒరుతట్టుమా యిరుక్కుమ్ – ఎన్గిఱతే పిళ్ళాన్ అరుళిచ్చెయ్వతు.

ఎమ్బెరుమాన్ దోషభోగ్యనాకిల్ చేతనన్ అచ్చమఱ్ఱు దోషఙ్గళై చ్చెయ్యవేణ్డివరు మెన్ఱు కూఱు దూషణమ్ దోషాదర్శిత్వపక్షత్తిలుమ్ సమానమ్. ఎమ్బెరుమానుడైయ క్షమాగుణత్తై అఱిన్దవర్కళుమ్ అజ్ఞాతే దోషఙ్గళై చ్చెయ్యవేణ్డివరుమన్ఱో! నామ్ దోషమ్ శెయ్యావిడిల్ ఎమ్బెరుమానుడైయ క్షమాగుణమ్ పుకర్పెఱాదెన్ఱు నినైత్తు క్కుఱ్ఱమ్ శెయ్యప్పుకుమవర్కళై ఎఙ్గనే విలక్కవల్లీర్! నామ్ అనర్థఙ్గళై నినైత్తుక్కొళ్ళాతొఴియిల్ ఎమ్బెరుమానుడైయ ఆపత్సఖత్వగుణమ్ నిఱమ్పెఱాతెన్ఱు నినైత్తు, తన్నై త్తానే నలిన్దుకొళ్ళ పుకుమవనైయుమ్, ఎఙ్గనే మఱుక్కక్కడవీర్? ఆక, ఇవఱ్ఱిల్ కుయుక్తికళై క్కొణ్డు భగవద్గుణత్తై కణ్ణఴిక్కలా మెన్ఱతాయిఱ్ఱు.

ఎమ్బెరుమానుక్కు అళవఱ్ఱ కుణఙ్గళ్ ఉళ్ళన. అవఱ్ఱిల్ ఎన్ద కుణమ్ ఎన్ద సమయత్తిల్ ఎన్ద వ్యక్తియిన్ మేల్ ఎన్ద విధమాక ప్రసరిక్కు మెన్ఱు నిలైయిడవల్లా రారు మిల్లై. అవనుడైయ వాత్సల్యగుణత్తిఱ్కు నామే ఇలక్కు – ఎన్గిఱ నిశ్చయవుణర్చ్చి నమక్కిరుక్కుమాకిల్, దోషఙ్గళై బుద్ధిపూర్వకమాకవే శెయ్యవేణ్డివరు మెన్గిఱ దూషణత్తిఱ్కు ఇడ ముణ్డాకలామ్. "కేవలమ్ స్వేచ్ఛయైవాహం ప్రేక్షే కంచిత్ కదాచన" (ఎనక్కే విరుప్పముణ్డామ్బోదు నాన్ ఏదో ఒరు సమయత్తిల్ ఏదో ఒరు వ్యక్తియై కృతాక్షిప్పేన్)



ఎన్ఱరుళిచ్చెయ్కిఱ ఎమ్బెరుమానై యతిన్దు వైత్తు, ఒరువన్ బుద్ధిపూర్వకమాక కుఱ్ఱమ్ శెయ్య ముయల క్కూడుమో? అగతికమాకవుమ్, అబుద్ధిపూర్వకమాకవుమ్ ఆశ్రితర్కళిడత్తిల్ ఏదేనుమ్ కుఱ్ఱఙ్గళ్ నేర్న్దిరున్దాల్ – అవఱ్ఱై యెమ్బెరుమాన్ కాణాక్కణ్ణిట్టిరుప్పన్. కణ్డాలుమ్ పొఱుప్పన్ – భోగ్యమాకవుమ్ కొళ్వన్ – ఎన్ఱదిత్తనై.

కఠోపనిషత్తిల్ (2-4-12) "అంగుష్ఠమాత్రః పురుషః మధ్య ఆత్మని తిష్ఠతి, ఈశానో భూతభవ్యస్య న తతో విజుగుప్సతే" ఎన్ఱవిడత్తిఱ్కు భాష్య మురైయానిన్ఱ రంగరామానుజ స్వామి "భూతభవ్యేశ్వరత్వా దేవ వాత్సల్యాతిశయాత్ దేహగతా నపి దోషాన్ భోగ్యతయా పశ్యతీత్యర్థః" ఎన్ఱురైత్తార్. శ్రీదేశికన్ వరదరాజపంచాశత్తిలే "ఔదన్వతే మహతి సద్మని భాసమానే శ్లాఘ్యే చ దివ్యసదనే తమసః పరస్మిన్, అంతఃకళేబర మిదం సుషిరం సుసూక్ష్మం జాతం కరీశ కథ మాదరణాస్పదం తే" (పరమపదమ్ ముదలియ శిఱన్ద స్థానఙ్గళై యెల్లామ్ ఇకఴ్న్దిట్టు పురమహేయమాన పావియేనుడలై భోగ్యమాక క్కొణ్డు వర్త్తిత్తాయే) ఎన్ఱార్. ఇప్పడిప్పట్ట దోషభోగ్యత్వమే వాత్సల్య మెన్ఱు ఇన్ద శ్లోకత్తిన్ వియాక్కియానత్తిలుమ్ విశదమాక ఉరైత్తార్కళ్. – ఇన్ద దోషభోగ్యత్వత్తై "మఙ్గవొట్టున్ మామాయై" (తిరువాయ్ –10-7-10) ఎన్ఱ పాట్టిలే ఆఴ్వారుమ్ విళఙ్గ ఉరైత్తరుళినర్.

శ్రీమద్రహస్యత్రయసారత్తిల్ ప్రభావవ్యవస్థాధికారత్తిలే – "ఎన్నడియా రతు శెయ్యార్, శెయ్దారేల్ నన్ఱు శెయ్దారెన్బర్ పోలుమ్ – ఎన్ఱవిడత్తిల్ "పోలు" మెన్ఱు శొల్లుకైయాలే ఇదు వస్తువృత్తియిల్ నన్ఱన్ఱెన్నుమిడమ్ సూచితమ్" – ఎన్ఱరుళిచ్చెయ్దిరుక్కిఱారే? ఎన్నిల్, "పిన్ తొడర్న్దోడియోర్ పామ్బై ప్పిడిత్తుక్కొణ్డాట్టినాయ్ పోలుమ్", "విళఙ్గా యెఱిన్దాయ్ పోలుమ్", "వరివళై త్తుణ్డిరున్దాన్ పోలుమ్", "మర మేఱి యిరున్దాయ్పోలుమ్.', "నాకత్తినోడు పిణఙ్గి నీ వన్దాయ్ పోలుమ్", "ఎన్దై పెరుమానార్ మరువి నిన్ఱవూర్ పోలుమ్" ఇత్యాదియాన పల్లాయిరమిడఙ్గళిలే "పోలు" మెన్ఱత్తై ఇశైనిఱైయాక క్కణ్డు వైత్తుమ్, వడమొఴియిల్ "కి మివ హి మధురాణామ్", "కథ మివ పరిచర్యామ్" ఇత్యాదికళిల్ "ఇవ" శబ్దమ్ పోలే ఇదువుమ్ తమిఴిల్ ఒరువకై వాక్యాలంకార మెన్ఱఱిన్దువైత్తుమ్ విపరీతార్థవర్ణనమ్ పణ్ణినతు అభినివేశవశత్తాల్ ఎన్ఱు అడియవర్క్కు మెయ్యనార్ పణిక్కుమ్బడి.

దయాశతకత్తిల్ "మయి తిష్ఠతి దుష్కృతాం ప్రధానే మితదోషా నితరాన్ విచిన్వతీ త్వమ్, అపరాధశతై రపూర్ణకుక్షి కమలాకాంతదయే! కథం భవిత్రీ" ఎన్ఱుమ్, "ఔత్సుక్య పూర్వ ముపహృత్య మహాపరాధన్ మాతః! ప్రసాదయితు మిచ్ఛతి మే మన స్త్వామ్, ఆలిహ్యా తా న్నిరవశేష మలబ్ధతృప్తిః తామ్యస్యహో వృషగిరీశధృతా! దయే! త్వమ్" ఎన్ఱుమ్ "భరన్యాసచ్ఛన్నప్రబలవృజిన ప్రాభృతభృతామ్" ఎన్ఱుమ్ అఴకాక అరుళిచ్చెయ్ద

ఆశిరియర్ ఇవర్గ్రుక్కు మురణామ్బడి ఒన్ఱిరణ్డు వార్త్తైకళ్ ఎழுదివైత్తారెన్నాల్, ఇదఱ్కునామ్ ఎన్న శొల్లవల్లోమ్!

"ఆగ్ర్ర మురైక్కి లడైన్దవర్పాల్ అమ్బుయకోన్, కుగ్ర్ర మునర్న్దికழு జ్కొళ్కైయినో - ఎగ్ర్రే! తన్కన్ఱినుడమ్బిన్ వழுవన్ఱో కాదలిప్పతు అన్ఱదనై ఈన్ఱుకన్ద ఆ" ఎన్ఱు ఞానసారత్తిలే అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ అరుళిచ్చెయ్ద పాశురమ్. "వాత్సల్యమ్ - దోషేషు గుణత్వబుద్ధిః" ఎన్ఱు శరణాగతిగద్యశ్రుతప్రకాశికైయిల్ శ్రీసూక్తి, "స హి చిరం పరిచీయమానేష్వపి శరణాగతేషు సహుంకారాః సపయ స్సంస్నవస్తనవేదనాః కింకర్తవ్యతాకులాః ధేనవ ఇవ సంభ్రామ్యతి" ఎన్ఱు సహస్రనామభాష్యత్తిలే వత్సలనామ వియాక్కియానత్తిల్ భట్టర్ శ్రీసూక్తి. ఇవగ్ర్రుక్కెల్లామ్ మూలమాక శ్రీపాంచరాత్రబ్రహ్మసంహితైయిల్ "కటుగంధేన విద్ధాయాం భూమౌ నవతృణాంకురమ్, యా న జిఘ్రతి సా ధేనుః స్వయోనిద్వారమార్గతః, సద్యోజాతస్య వత్సస్య దేహమాలిన్య సంపదమ్, యథా లిహతి సోల్లాసం తథా జీవస్య కల్మషమ్, భోగ్యం మమ చ లక్ష్మ్యా శ్చ విద్ధి పంకజసంభవ" ఎన్ఱు పరక్క ప్పేశప్పట్టదు.

ఇప్పడి ఉపపత్తికళ్ పల పల వుణ్డా కైయాలే కుగ్ర్రజ్గళై నగ్ర్రమాక క్కొళ్ళుమ్ కుణమ్ ఎమ్బెరుమానుక్కు క్కణ్ణழிవగ్ర్ర దేయామ్. "పొయ్న్నిన్ఱ ఞానముమ్ పొల్లా వొழுక్కు మழுక్కుడమ్బు" మాన నమ్పోలియర్కళిన్ శరీరత్తిలే విరుమ్బి యురైకిన్ఱ ఎమ్బెరుమానై దోషభోగ్య నెన్న ఇశైయాదార్ చార్వాకాదికళైయే నల్లాక్కినార్కళెన్ఱు ఞానప్పిరాన్ పణిక్కుమ్. "ఇప్పడి ఎమ్బెరుమానుక్కుళ్ళ దోషభోగ్యత్వగుణత్తై సాగ్రహమాక ఇల్లై చ్చెయ్యుమవర్కళ్ నిర్గుణబ్రహ్మవాదికోటియిలే అన్తర్భవిక్క అழுకితు" ఎన్ఱు ఎణ్ణువారిదరై క్కళైవాన్పిళ్ళై పణిక్కుమ్.

ముడివిల్ సారమాక ఒన్ఱు తలైక్కట్టుకిఱోమ్. ఎమ్బెరుమానుక్కు ప్పల్లాయిరమ్ గుణజ్గళిరున్దాలుమ్, ఆశ్రితర్కళ్పక్కలిలే అవన్ అళవుమ్ కడైన్ద అన్బుడైయవన్ ఎన్ఱుమిదత్తై నన్గు విళక్కవల్ల గుణజ్గళే ప్రధానజ్గళ్. ఉలకత్తిలే అన్బిన్ మికుతియై నామ్ ఎజ్గనే కాణ్గిఱో ఎన్నాల్. హా! హా! దేవదత్తనుక్కు యజ్ఞదత్తనిడత్తిల్ ఎన్న అన్బు! ఎన్న అన్బు! ఇవన్ ఎత్తనై యపరాధజ్గళ్ శెయ్దాలుమ్ అత్తనైయుమ్ అవనుక్కు భోగ్యమాకిఱతే యొழிయ, ఒన్ఱావతు ఇకழுవుక్కు ఉఱుప్పాకిఱతిల్లైయే! ఇవన్ కాలిల్ ముళ్ తైత్తాలుమ్ అవన్ కణ్ణిల్ నీర్ పెరుకుకిన్ఱదే! ఇప్పడియుమ్ ఒరు అన్బు ఇరుక్కుమో!" ఎన్ఱు శొల్ప్పోక్కుకళ్ ఇరుక్కుమ్బడియై ఎజ్గుమ్ కాణానిన్ఱోమ్. ఆకవే, దోషభోగ్యత్వముమ్, పరదుఃఖదుః ఖిత్వము మాకిఱ ఇరణ్డు గుణజ్గళుమ్ పూర్వపక్షికళ్ ఎమ్బెరుమాన్ తిఱత్తిలే అవద్యమ్ శొల్లిత్తీర్న్దార్కళాన పిన్బు, మగ్ర్ర కుణజ్గళి నుణ్మైయై ఇశైన్దు వైత్తుమ్ పయన్



పెగ్ర్రార్కళిల్లై. జామాతావై ప్పుకழு ప్పుకున్దానొరువన్ "నమ్ మాప్పిళ్ళైక్కు ముప్పత్తిరణ్డుగుణజ్గళిల్ ఇరణ్డు గుణజ్గళ్ మాత్తిరమే కుఱై. నమ్మై తీమైకళ్ తాను మఱియాన్; పిఱర్ శొల్లిలుమ్ కేళాన్. మగ్ర్రెల్లామ్ కుణజ్గళుమ్ కుఱైవగ్ర్రన" ఎన్ను మాప్పోలేయిఱే ఇవర్కళ్ పణ్ణుమ్ భగవద్గుణప్రశంసై యిరుక్కిఱపడి. "ఆశ్రితర్కళిడత్తిల్ ఎమ్బెరుమానుక్కు అన్బు ఉణ్డు" ఎన్ఱు అవనుడైయ ప్రేమగుణత్తై ఇశైన్దు వైత్తుమ్, అదన్ అతిశయత్తై సహిక్కిన్ఱిలారాకైయాలే "జగ్ధస్య కాననమృగైః మృగతృష్ణికేప్సోః కాసారసత్త్వనిహతస్య చ కో విశేషః" ఎన్ఱ ఆழ்వాన్ శ్రీసూక్తిక్కు ఇవర్కళుమ్ ఇలక్కాక క్కుఱైయిల్లై. ఆయిరన్దాన్ శొల్లిలుమ్ కుగ్ర్రజ్గళై నగ్ర్రమాక క్కొళ్ళుకై ఆహార్యజ్ఞానమే యామ్-ఎన్ఱు మీణ్డుమ్ మీణ్డుమ్ కలజ్గి ప్పేశువర్కళై ప్పగ్ర్ర "అన్దో! కరువిలే తిరువిలామైయే" ఎన్ఱు ఇరజ్గక్కడవతత్తనై.

ఇన్నము మిజ్గ విరిత్తురైక్కవేణ్డియవగ్ర్రై భగవద్గుణరత్నభాండాగారత్తిల్ విరిత్తురైత్తోమ్. కణ్డుకొళ్క.

**దివ్యార్థ:- అను:- (కున్ఱనైయ కుగ్ర్రమ్)** భగవానుని వాత్సల్యగుణంలో అభివిష్టులై పలుకుతున్నారు. మనసా! ఆంతరికమైన ప్రేమాధిక్యంచే వాక్కులను కూర్చి, భగవానుని స్తుతించేవారు పలువురు ఉన్నారు. అటువంటి ప్రేమ మనకు లేకపోవడంవల్ల కంఠానికి పైగానే (అహృదయంగానే) కొన్ని మాటలను మనం కపటంగా చెప్పగలము. ఆవిధంగా పైపైన చెప్పే మాటలుగా ఉన్నా, అవి భగవానునకు సంబంధించిన మాటలు అయితే ఫలిస్తాయి. భగవానుడు **"మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన"** (ప్రీతిని ఆరోపించుకొని వచ్చేవానినికూడ నేను చేయి విడువను) అని చెప్పినవాడు కావడంవల్ల మనం పైపైకి చెప్పే వార్తనుకూడా అతడు ఘనంగా భావించి, తన వాత్సల్యగుణాన్ని మనపై ప్రవహింపజేస్తాడు. మనం కొండలు కొండలుగా పాపాలను చేసినా **"ఎన్నడియార్ అదు శెయ్యార్ శెయ్దారేల్ నన్ఱు శెయ్దార్"** అని పలికే వాని మనస్సులో అవి అన్నీ గుణాలుగానే తోస్తాయి. అతడు మన అభిముఖ్యాన్ని మాత్రమే ఎదురు చూచేవాడు కాబట్టి మనం పైకి చెప్పే వార్త కూడా అతనికి కార్యోపయోగిగా అవుతుంది సుమా! అని అన్నారు.

శ్రీవైకుంఠంలో భగవానుడు నిత్యులతోను, ముక్తులతోను కూడి పరిపూర్ణానుభవాన్ని పొందుతున్నప్పటికీ, దానివల్ల స్వామి కొంచెం కూడా ఆనందించకుండా, పలువురు పుత్రులను కల్గిన ఒక తండ్రి ఒక కొడుకు మాత్రం దేశాంతరంలో ఉంటే, మిగిలిన అందఱు పుత్రులతోను కూడి జీవిస్తున్నా, దానివల్ల ఆనందాన్ని పొందలేక, దేశాంతరంలో ఉన్న పుత్రుని విశ్లేషాన్నే తలచి పరితపిస్తున్నట్లే, భగవానుడు సంసారులమైన అస్మదాదుల

విశ్లేషాన్నే తలుస్తూ పరితాపాన్ని పొంది, మనతో కలసి వర్తించడానికై కరణకళేబరాలను మనకు ప్రసాదించి, వానినితో మనం కార్యాన్ని చేసేటట్లు విశేషశక్తినికూడా మనకు ఇచ్చి, మిక్కిలి అహంకారులం అయిన మనకెదురుగా తాను ప్రత్యక్షంగా వచ్చి నిలిస్తే, మనం సహించలేక శపథం చేసి అయినా తనను దూరంగా ఉంచుతామని భావించి, ఎవరి కన్నులకుకూడా కనబడకుండే రీతిలో, నిద్రిస్తున్న బిడ్డను తల్లి ఒడిలో దగ్గఱకు తీసికొని ఉన్నట్లు, భగవానుడు కూడా తన సంబంధమే ఆధారంగా (ఆలంబనంగా) మనలను విడువకుండా అంతర్యామిగా, వెంబడిస్తూ ఉండి, మనలను ఏ క్షణంలోనూ చేయి విడువకుండా సత్తను రక్షిస్తూ, మనకు సహాయంగా ఉన్నపుడు, మనం చెడ్డకార్యాలనే చేస్తుండగా, మనలను సంస్కరించడంకోసం తగిన సమయాన్ని వేచి చూస్తూ, మనం చేస్తున్న పాపాలలో ఏదైన ఒక పాపం అయినా (విషయప్రవణుడై వేశ్యలను వెంబడించి మాటిమాటికి దేవాలయల్లోనికి పోయి ప్రవేశించడం, పొలాల్లో మేతమేస్తున్న పశువును కొట్టడం కోసం తరుముతూ వెడుతున్నపుడు అది కోవెలను ప్రదక్షిణం చేస్తూ పరుగెత్తే సమయంలో దాన్ని విడువలేని ఆగ్రహంతో తానుకూడా ఆ కోవెలకు చుట్టూ ప్రదక్షిణం చేయడం, శిశుపాలాదులవలె నిందను చేయడానికై తిరునామానుసంధానం చేయడం–మొదలైన) మంచి అని పేరు పెట్టడానికి వీలవుతుందా! అని భావించి, చూచి, అటువంటి చెడ్డ కార్యాలను కూడా గ్రహించి, "నా ఊరిని చెప్పావు, నా పేరును చెప్పావు"– అని ఈ విధంగా కొన్ని సుకృతాలను ఆరోపించి, ఒకనికి తెలియకుండా అతని ఒడిలో మామిడి కాయను పెట్టి, దాన్ని వాడే తన ఒడిలో పెట్టినట్లుగా పల్కి (**"మడిమాఙ్గాయిట్టు"**), కార్యాన్ని (పనిని) పూర్తి చేస్తాడు–అని ఇతిహాసపురాణాలలో చూస్తున్నాము. కాబట్టి, ఈ విధంగా అనుగ్రహించడానికి కొంచెం వ్యాజమాత్రాన్ని ఎదురుచూస్తూ తిరుగుతున్న స్వామి మనస్సుకు తగినట్లు **"పుఱనురైయే యాయినుమ్ పొన్నాళ్తిక్కైయాన్ తిఱనురైయే శిన్దిత్తిరు"** అంటూ ఇచట అనుగ్రహించారు.

**"కున్ఱనైయ కుర్ర్ఱమ్ శెయ్యినుమ్ కుణమ్ కొళ్ళుమ్"** అనే మొదటి పాదానికి రెండు రీతులలో అర్థాన్ని చెబుతారు. 1. మనం కొండలు కొండలుగా పాపాలను చేసినా భగవానుడు వానిలో దేనిలోను దృష్టిపెట్టకుండా గుణంగా ఉన్నవానినే గ్రహిస్తాడు–అని ఒక అర్థం. 2. మనం కొండలు కొండలుగా పాపాలను చేసినా, వానిని అన్నిటిని తాను గుణంగానే గ్రహిస్తాడు, అంటే భోగ్యంగా గ్రహిస్తాడు –అని ఇంకొక అర్థం. వీనిలో మొదటి అర్థం కంటె రెండవ అర్థం గొప్పది. దోషాల్లో దృష్టిపెట్టకుండా గుణంగా ఉన్నవానినే గ్రహిస్తాడు అనే అనే అర్థంలో, మనవద్ద గుణాలు కొన్ని ఉన్నాయని స్పష్టంగా చెప్పినట్లవుతుంది. **"అకృతసుకృతక స్సుదుష్కృత్తరః శుభగుణలవలేశదేశాతిగః, అశుభగుణపరస్సహస్రావృతః వరద మురుదయం గతిం త్వాం వృణే"** (కూరేశుల వరదరాజస్తవం–92) అన్నట్లు దోషాలతోనే కడుపు నిండుస్తున్నట్లు గుణం అనేది



లవలేశంకూడా లేదని అనుసంధించే పెద్దల భావానికి అనుగుణంగా "దోషాలను అన్నిటిని గుణంగా గ్రహించేవాడు" అనే అర్థం చాలా విలక్షణమైనది.

దోషాలను గుణాలుగా గ్రహిస్తాడనే ఈ అర్థంలోని సారస్యాన్నిగూర్చి కొన్ని చెప్పవలసినవి ఉన్నాయి. వినండి. ఈ లోకంలో **"మది వికఱ్పాల్ పిణఙ్గుమ్ శమయఙ్గళ్ పల పల"** (మతివికల్పంచేత భ్రమించే మతాలు అనేకం) ఉన్నాయి. "భగవానుడే లేడు"– అనే బాహ్యమతాలు, భగవానుడొకడున్నాడని అంగీకరించి, అతనికి గుణం లేదు అనే (నిర్గుణబ్రహ్మవాదులైన) కుదృష్టులు–అని ఈ విధంగా ఉన్నట్లే, భగవానుని, అతనికి గుణాలను అంగీకరించి, "కాని ఆ గుణాలు పరిమితమైనవి" అనే భావాన్ని కలవారు కూడా కొందరున్నారు. **"ఉయర్వఱ ఉయర్నల ముడైయవన్"** అని అనుగ్రహించిన ఆళ్వార్లను, **"అనవధికాతిశయాసంఖ్యేయ కల్యాణగుణౌఘమహార్ణవ"** అని అనుగ్రహించిన భగవద్రామానుజులను అనుసరించే సాత్త్వికుల సిద్ధాంతం "భగవానుని కల్యాణగుణాల అతిశయానికి అవధి లేదు" అనేదే. భగవానుని లెక్కలేనన్ని గుణాలలో వాత్సల్యం అనేది ఒకటి. (దాసుల) దోషాలను చూడకపోవడమే వాత్సల్యం–అని కొందఱి సిద్ధాంతం. ఆ విధంగా కాకుండా దోషాలను కూడా భోగ్యంగా గ్రహించడమే వాత్సల్యం–అనేది సత్సంప్రదాయసిద్ధాంతం. ఈ విధంగా అర్థం గ్రహిస్తే శాస్త్రార్థాలు వ్యాకులం చెందుతాయని వాదించేవారూ ఉన్నారు. అది భగవానుని గుణాలకు కొఱత చెప్పినట్లే అవుతుంది, అంతే. దాసుల దోషాలను చూచి అసహ్యించుకోకుండా' వారిని స్వీకరించడానికి ఆ దోషాలనే ఉపహారంగా గ్రహించడం వాత్సల్యం – అనే సత్సంప్రదాయార్థంలో ఏ కొఱత లేదు. దోషాలను భోగ్యంగా గ్రహించడం అనేది గుణమా? కాదా? అని సామాన్యంగా ప్రశ్నిద్దాం. భగవానుని విషయంలో ఈ ప్రశ్న అడుగుతున్నామని కాకుండా సామాన్యంగా అడుగుతున్నామని గ్రహించి, సమాధానం చెప్పాలి. **"సంబంధవిశేషాన్వితేషు ప్రీతిః స్నేహః, యస్య విపాకాః – అస్థానభయశంకిత్వం, దోషానవభాసః, దోషేఽపి గుణత్వబుద్ధి రిత్యాదయః"** (సంబంధం ఉన్నవారి విషయంలో ఉన్న ప్రేమకు పలు పరిపాకాలు ఉన్నాయి. అవి ఏమంటే–కారణం లేకుండానే భయాన్ని పొందడం, దోషం కనబడకపోవడం, దోషాన్నికూడా గుణంగా గ్రహించడం మొదలైనవి) అని శ్రుతప్రకాశికలో చెప్పబడడంచేత దోషాలనుకూడ గుణాలుగా గ్రహించడం అనేది గొప్ప గుణమే–అని అనాలి తప్ప, గుణంకాదని అనరాదు. **"వాత్సల్యం నామ దోషేష్వపి గుణత్వబుద్ధిః"** అని సమన్వయాధికరణశ్రుతప్రకాశికలోకూడా ఉన్నది. అందువల్ల, గుణమని ఏర్పడే ఇది భగవానునకు లేదంటే అతనికి ఒక గుణం లేకుండా పోతుంది. అపుడు భగవద్గుణాలకు ప్రయోగించిన **''ఉయర్వఱ ఉయర్''** అన్న విశేషణం, **"అనవధికాతిశయ"** అనే విశేషణం వ్యర్థాలే.

నిజానికి దోషాలను గుణమని గ్రహిస్తే ఇది భ్రాంతిజ్ఞానం అయినందువల్ల, స్వామిని భ్రాంతుడని చెప్పినట్లు కాదా! అంటే, ప్రేమాతిశయంతో కలిగే భ్రమ అంతా ఉత్తమోత్తమమే. “లోకమంతా నాకు శరీరం, నేనొక్కడనే శరీరి” అని పల్కిన భగవానుడే దానికి విరుద్ధంగా **“జ్ఞానీత్వాత్మైవ మే మతమ్”** అని గీతలో పలికినాడు కదా! దీనినికూడ భ్రమ అని అనవద్దా! తూప్పుల్ అమ్మాన్ (వేదాంతదేశికులు) అనుగ్రహించిన **“విరోధపరిహార”** మనే రహస్యగ్రంథంలో **“సర్వశేషియాన సర్వేశ్వరన్ ఆశ్రితర్కళై ప్పర్రి శేషమా యిరుక్కు మిరుప్పు గుణకృతమాయ్, ప్రీత్యతిశయహేతువాకైయాలే దోష మన్రు”** (సర్వశేషి అయిన సర్వేశ్వరుడు ఆశ్రితుల విషయంలో శేషంగా ఉండే స్థితి గుణకృతమై, ప్రీత్యతిశయాన్ని హేతువుగా కల్గినది కాబట్టి దోషం కాదు) అని ఉండడాన్ని చూచారా? **“ఉన్నదెన్నదావియుమ్ ఎన్నదున్న దావియుమ్”** (తిరువాయ్-5-3-8) అనే సూక్తికి ఆళవన్దార్ అనుగ్రహించినది గ్రహించారా? సర్వరక్షకుడైన భగవానుని రక్ష్యకోటిలోనికి చేర్చి, మంగళాశాసనం చేయడంకూడా భ్రాంతికార్యమని చెప్పి, దూషింపబడాలికదా! నోము నోచడం, మన్మథుని కాలికి నమస్కరించడం, మడల్ ఎత్తుతానని అనడం-మొదలైన ప్రపన్నసంతానప్రవృత్తులన్నీ భ్రాంతికార్యాలని చెప్పి, ఆళ్వార్లనుకూడా దూషించవలసి ఉంటుంది. **“ఆఙ్గారవార మదు కేట్టు అళ్గలుమిళ్గుమ్ పూఙ్గారరవు”** (నాన్ముకన్-10), **“స్నేహా దస్థానరక్షావ్యసనిభి రభయం శార్ఙ్గచక్రాసిముఖ్యైః”** (శ్రీగుణరత్న) ఇత్యాదిగా **“నలమన్ద మిల్లదోర్ నాడు”** (అంతులేని ఆనందాన్నికల పరమపదం)లో కూడా **“ఇరుళ్ తరు మాఞాలమ్”** (అజ్ఞానాన్ని కలుగజేసే భూలోకం) లోవలె భయశంకను పొంది కలతను చెందే **“అయర్వఱుమమరర్కళ్”** ను కూడా జ్ఞానహీనులైన మానవులతో సమానంగా భావించవలసి ఉంటుంది.

**“సౌశీల్యం నామ - మందజనసంశ్లేషదశాయాం స్వమహత్త్వాబుద్ధిరాహిత్యమ్”** (సౌశీల్యగుణం అంటే మందజనులతోను కలసి ప్రవర్తించేటపుడు, తాను చాలా గొప్పవాడను అనే భావాన్ని విడచివేయడం) అని శ్రీమద్వేదాంతదేశికులు అనుగ్రహించారు. భగవానుడు **“మహతో మహీయాన్”** అనబడే తనను మందులలో చిట్టచివరివానినిగా భావించడం ఏవిధంగానోకదా తగినది!

**“జ్ఞానవిపాకకార్యమాన అజ్ఞానత్తాలే వరుమవై యెల్లామ్ అడిక్కళ్గుఇఙ్జపెఱుమ్”** (జ్ఞానవిపాకకార్యం అయిన అజ్ఞానంవల్ల ఏర్పడేవి అన్నీ శ్లాఘ్యాలు) అనే శ్రీవచనభూషణ శ్రీసూక్తికి అంగీకరించి, పూర్వం పల్కిన విషయాలను అన్నిటినీ తగినవి అని అన్నపుడు, ఈ లెక్కలోనేకదా **“దోషేషు గుణత్వబుద్ధిః”** అనే ప్రకృతవిషయాన్నికూడా అంగీకరించవలసి ఉన్నది. అమరసింహుడు తాను రచించిన కోశంలో **“స్నిగ్ధ స్తు వత్సలః”** - వత్సలుడంటే స్నేహాన్ని కలవాడు-అని అన్నాడే కాని, **“భ్రాంత స్తు వత్సలః”** - భ్రమను కలవాడు వత్సలుడు - అని అనలేదు అంటూ కొందఱు వాదించారు. దోషాన్ని గుణంగా



గ్రహించడం అనే గుణత్వజ్ఞానం స్నేహవిపాకం-(అంటే) అనురాగం ముదిరిన-అవస్థ అని శ్రుతప్రకాశికలో చెప్పబడినందువల్ల, పరమకాష్ఠాపన్న (ముదిరిన స్థితిని పొందిన) స్నేహమేకదా వాత్సల్యం - అనేది. అందువల్ల అమరసింహుడు చెప్పినది ఔచిత్యాన్ని కల్గినదే. **“స్నేహోచ్ఛ్రాయదశాపరావధితయా దోషే గుణత్వగ్రహో వ్యాజహ్రే హి సుదర్శనార్యగురుభిః శ్రీభాష్యటీకాకృతౌ, ఏవం చామరసింహకోశపఠితం స్నిగ్ధత్వవాత్సల్యయోః పర్యాయత్వ మవద్యగంధవిధురం సంజాఘటీతి స్ఫుటమ్”** అని సంప్రదాయసిద్ధాంజనం అనే గ్రంథంలో కూడా చెప్పాము.

దోషంలో దోషత్వమనే స్వభావం ఎల్లప్పుడూ స్ఫురిస్తూ ఉండగా, దోషాన్ని చూచి గుణమని గ్రహించడం భగవానుని సర్వజ్ఞత్వాని, తత్త్వజ్ఞతకు లోపమే కదా! అని అంటూ ఒక వాదాన్ని వాదిస్తారు. అయ్యో! దోషాన్ని చూడకపోవడం వాత్సల్యం-అనే భావాన్ని కలవారు తాము ఈ దూషణానికి పరిహారాన్ని చెప్పి తీరాలికదా! సర్వజ్ఞునకు అజ్ఞానాన్ని అంగీకరించడంలో, అన్యథాజ్ఞానాన్ని అంగీకరించడంలో తేడాలేదు సుమా! ఒక వస్తువును యథావత్తుగా తెలియలేనపుడు, పూర్తిగా తెలియనితనం (అజ్ఞానం), సంశయాత్మగా భ్రమించి ఉండడం, విపరీతంగా తెలిసికోవడం-అనే అన్నీ తుల్యయోగక్షేమాలు - అనేది నిర్వివాదవిషయం. కాబట్టి, భగవానుని వీరు అజ్ఞునిగా చెప్పడంతో మేము అన్యథాజ్ఞానిగా చెప్పడంతో భేదం లేదుకదా! (దోషాలను చూడడం అనేది అజ్ఞుడన్నట్లు దోషాలను గుణంగా గ్రహిస్తాడనేది అన్యథాజ్ఞానం - అని భావం)

సహస్రనామంలో **“భక్తవత్సలః”** అనే నామానికి భగవద్గుణదర్పణంలో భాష్యాన్ని అనుగ్రహించే భట్టరు **“తల్లాభసంభ్రమవిస్మృతాన్యకామః భక్తవత్సలః”** (ఒక దాసుణ్ణి పొందిన అతిశయంచేత మిగిలిన దేనిలోను ఆశను కల్గి ఉండకుండ అన్నిటినీ మఱచి పోవడం భక్తవాత్సల్యం) అన్నారు. ఈ సూక్తిలోని మాధుర్యాన్ని గంభీరంగా పరిశీలించి, ఆనందించేవారు ఎవరు? సహస్రనామంలో **“సహస్రాంశుః”** అని అంటూనే, **“అవిజ్ఞాతా”** అని అనబడింది. **“సహస్రాంశుః”** - సర్వతోముఖమైన జ్ఞానాన్ని కలవాడు. **“అవిజ్ఞాతా”** (దాసులు చేసే దోషాలను తెలియనివాడు) అజ్ఞత్వ-సర్వజ్ఞత్వాలకు సామానాధికరణ్యాన్ని వీరు (ఈ రీతిలో) నిర్వహించేటపుడు అన్యథాజ్ఞాతృత్వాన్ని నిర్వహించడంలో ఏమి కష్టం ఉన్నది?

ఇక్కడ సూక్ష్మంగా ఒకటి విచారించాలి. స్వామి దాసుల దోషాలను చూడడు అనే అర్థం, దోషాలను భోగ్యంగా గ్రహిస్తాడు అనే అర్థం - అనే రెండూ గ్రంథాల్లో ఉన్నాయి. **“సహస్రాంశుః”** అనే తిరునామంయొక్క భాష్యంలోను, అంతరధికరణ శ్రుతప్రకాశికలోను, ఇంకా పలుచోట్ల దోషాదర్శిత్వోక్తిని (దోషాలలో దృష్టిపెట్టకపోవడం అనే దాన్ని)

చూడవచ్చు. అందువల్ల భగవానునకు దోషభోగ్యత్వం తప్ప దోషాదర్శిత్వమే లేదు–అని సిద్ధాంతులు చెప్పరు. పూర్వపక్షులు మాత్రం, దోషాదర్శిత్వాన్ని మాత్రం అంగీకరించి, దోషభోగ్యత్వాన్ని తిరస్కరిస్తారు. రెండింటికిని లోటు లేదని అంటారు సిద్ధాంతులు. దోషాదర్శిత్వం, దోషభోగ్యత్వం – అనే ఈ రెండు విరుద్ధధర్మాలు కావు. దోషాదర్శిత్వం అనేది ప్రీతియొక్క ప్రథమపర్వం అని, దోషభోగ్యత్వం అనేది ప్రీతియొక్క చరమపర్వం–అని ఆచార్యులు తెలియజేశారు. భగవానుడు కొందఱిపట్ల కొన్ని సమయాలలో దోషాలను చూడనివాడుగాను, వేఱొక సమయంలో వారిపట్లనో, వేఱొకరి విషయంలోనో దోషాలను భోగ్యంగా గ్రహించేవాడుగాను ఉంటాడు అని కదా సత్సంప్రదాయం. ఇందులో విప్రపత్తి ఉంటే క్షమాగుణం దోషాదర్శిత్వంతో విరోధిస్తుందని అనాలి. దోషాలను చూడడమే లేకపోతే క్షమించే ప్రసక్తే లేకుండాపోతుంది కదా! **"క్షమాకాష్ఠాభూతవాత్సల్యకథనేన క్షమాఽప్యుక్తా భవతి"** అని అన్నారుకదా దేశికులు గద్యభాష్యంలో.

ఒక గుణాన్ని గ్రహించి వేఱొక గుణాన్ని నిరసించాలని చూచినట్లయితే, పరత్వం ఒకటే అతిశయించి ఉండి, మిగిలిన గుణాలన్నీ సముద్రంలోకి చేరి, కనపడకుండా పోయేటట్లుగా తర్కకౌశలాన్ని చూపడమే అవుతుంది. **"పిణఙ్గి అమరర్ పిదగ్గ్రుమ్ కుణఙ్కళ్లు కొళ్కైయినాన్"** అయిన భగవానుని గుణప్రసరణానికి క్షుద్రయుక్తులతో తక్కువదనాన్ని చెప్పాలని చూడడం వక్తలకే దోషం అవుతుంది. భగవానుని ప్రణయరసం రెండు తీరాలను తాకుతు ప్రవహిస్తే, ఆనకట్ట కట్టి, ఆనపెట్టి అడ్డుకొనేవారు లేరుసుమా! "శాస్త్రాలన్నీ ఒక ఎత్తుగా, అతని కల్యాణగుణప్రసరం ఒక ఎత్తుగా ఉంటుంది" అని కదా పిళ్ళాన్ అనుగ్రహించినది.

భగవానుడు దోషభోగ్యుడైతే చేతనుడు భయం తీరి, దోషాలనే చేయవలసి వస్తుందని చెప్పే దూషణం దోషాదర్శిత్వపక్షంలోను సమానమే. భగవానుని క్షమాగుణాన్ని తెలిసినవారుకూడా భయపడకుండా దోషాలను చేయవలసి వస్తుందికదా! మనం దోషం చేయకపోతే భగవానుని కృప ప్రకాశించదని తలచి, దోషం చేయాలని ప్రారంభించేవారిని ఏవిధంగా అడ్డుకుంటారు?మనం అనర్థాలను కొనితెచ్చుకోకపోతే, భగవానుని ఆపత్సఖత్వమనే గుణం ప్రకాశించదని తలచి, తనను తానే బాధించుకోవడానికి ప్రయత్నించేవానిని ఏవిధంగా అడ్డుకోగలరు? కాబట్టి, దీనివల్ల కుయుక్తులతో భగవద్గుణాన్ని లోటు కలిగేటట్లు చేయకూడదని తెలిసింది.

భగవానునకు లెక్కలేనన్ని గుణాలు ఉన్నాయి. వానిలో ఏగుణం ఏ సమయంలో ఏ వ్యక్తిపై ఏవిధంగా ప్రసరిస్తుందని స్థిరంగా చెప్పగలవారెవరు లేరు. "అతని వాత్సల్యగుణానికి మనమే లక్ష్యం" అనే నిశ్చయజ్ఞానం మనకు ఉంటే, దోషాలను



బుద్ధిపూర్వకంగానే చేయవలసి వస్తుంది–అనే దూషణానికి అవకాశం ఉండవచ్చు. **"కేవలం స్వేచ్ఛయైవాహం ప్రేక్షే కంచిత్ కదాచన"** (నాకు ఇచ్ఛ కల్గినపుడు నేను ఏదో ఒక సమయంలో ఎవరినో ఒక వ్యక్తిని కటాక్షిస్తాను) అని అనుగ్రహించిన భగవానుని తెలిసికొని, ఒకడు బుద్ధిపూర్వకంగా దోషాలను చేయప్రయత్నిస్తాడా! అగతికంగా, అబుద్ధిపూర్వకంగా ఆశ్రితులవిషయంలో ఏవైనా దోషాలు సంభవిస్తే వానిని భగవానుడు గమనించకుండా ఉంటాడు. చూచినా క్షమిస్తాడు. భోగ్యంగాను గ్రహిస్తాడు–అని చెప్పాలి అంతే.

కఠోపనిషత్తులో (2-4-12) **"అంగుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి, ఈశానో భూతభవ్యస్య న తతో విజుగుప్సతే"** అనే సూక్తికి భాష్యాన్ని అనుగ్రహించే రంగరామానుజస్వామి **"భూతభవ్యేశ్వరత్వా దేవ వాత్సల్యాతిశయాత్ దేహగతా నపి దోషాన్ భోగ్యతయా పశ్యతీత్యర్థః"**–అని వివరించారు. శ్రీదేశికులు వరదరాజపంచాశత్తులో **"ఔదన్వతే మహతి సద్మని భాసమానే శ్లాఘ్యే చ దివ్యసదనే తమసః పరస్మిన్, అంతః కళేబర మిదం సుసుషిరం సుసూక్ష్మం జాతం కరీశ కథ మాదరణాస్పదం తే"** (పరమపదం మొదలైన గొప్ప స్థానాలను అన్నిటిని విడచి, పరమహేయమైన, పాపిని అయిన నా శరీరాన్ని భోగ్యంగా గ్రహించి వర్తిస్తున్నావే!) అని అన్నారు. ఇటువంటి దోషభోగ్యత్వమే వాత్సల్యమని ఈ శ్లోకవ్యాఖ్యానంలోకూడా విశదంగా వివరించారు. ఈ దోషభోగ్యత్వాన్ని **"మజ్ఞవొట్టున్ మామాయై"** అనే పాశురంలో ఆళ్వార్లుకూడా వ్యక్తం అయేటట్లు పలికినారు.

శ్రీమద్రహస్యత్రయసారంలోని ప్రభావవ్యవస్థాధికారంలో **"ఎన్నడియారదు శెయ్యార్ శెయ్దారేల్ నన్రు శెయ్దారెన్బర్ పోలుమ్ ఎన్రవిడత్తిల్ పోలు మెన్రు శొల్లుకైయాలే ఇదు వస్తువృత్తియిల్ నన్రెన్రుమిదమ్ సూచితమ్"** – అని అనుగ్రహించారు కదా! అని అంటే, **"పిన్ తొడర్ న్దోడియోర్ పామ్బై ప్పిడిత్తిక్కొణ్డాట్టినాయ్ పోలుమ్"**, **"మర మేతి యిరున్దాయ్ పోలుమ్"**, **"నాకత్తినోడు పిణఙ్గి నీ వన్దాయ్ పోలుమ్"**, **"ఎన్రై పెరుమానార్ మరువి నిన్ర వూర్ పోలుమ్"** ఇత్యాదులైన పరస్సహస్రసందర్భాలలో **"పోలుమ్"** అనే దానిని **"ఇశైనిఱై"** గా (వాక్యాలంకారంగా) గ్రహించినట్లే, సంస్కృతంలో **"కి మివ హి మధురాణామ్" "కథ మివ పరిచర్యామ్"** ఇత్యాదులలోని **"ఇవ"** శబ్దంవలె, ఇది కూడా. విపరీతార్థవర్ణనం చేసినది అభినివేశవశంతోనే అని – **"అడియవర్క్కు మెయ్యనార్"** వచించారు.

దయాశతకంలో **"మయి తిష్ఠతి దుష్కృతాం ప్రధానే మితదోషా నితరాన్ విచిన్వతీ త్వమ్, అపరాధశతై రపూర్ణకుక్షిః కమలాకాంతదయే! కథం భవిత్రీ"** అని **"ఔత్సుక్యపూర్వ ముపహృత్య మహాపరాధాన్ మాతః ప్రసాదయితు మిచ్ఛతి మే మన స్త్వామ్, ఆలిహ్యా తా న్నిరవశేష మలబ్ధతృప్తిః తామ్యస్యహో వృషగిరీశధృతా! దయేత్వమ్"** అని,

**“భరన్యాసచ్ఛన్నప్రబలవృజినప్రాభృతభృతమ్”** అని అందంగా అనుగ్రహించిన ఆచార్యులు వీనికి విరుద్ధంగా ఏవో ఒకటి రెండు మాటలను వ్రాసినారంటే దీనికి మనం ఏం చెప్పగలం?

**“అగ్ఱ్ఱ ముఱైక్కిల్ అదైన్దవర్పాలమ్బుయకోన్ కుగ్ఱ్ఱ మురుర్న్దిక్కళుమ్ కొళ్కైయనో! ఎగ్ఱ్ఱే! తన్ కణ్ణి సుడమ్బిన్ వళు వన్దో కాదలిప్పతు అన్దదనై ఈన్దుకన్ద ఆ”** అనే జ్ఞానసారప్రబంధంలో అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ అనుగ్రహించిన పాశురం, **“వాత్సల్యం దోషేష్వపి గుణత్వ బుద్ధిః”** అంటూ శరణాగతిగద్యశ్రుతప్రకాశికలోని శ్రీసూక్తి, **“న హి చిరం పరిచీయమానేష్వపి శరణాగతేషు కస్యాపి హేతోః సద్యః ప్రసూతేష్వివ వత్సేషు సహుంకారాః సపయస్సంస్నవస్తనవేదనాః కింకర్తవ్యతాకులా ధేనవ ఇవ సంభ్రామ్యతి”** అని సహస్రనామభాష్యంలోని వత్సలనామ వ్యాఖ్యానంలో భట్టర్ శ్రీసూక్తి, వీని కన్నిటికీ మూలంగా శ్రీపాంచరాత్రసంహితలో **“కటుగంధేన విద్ధాయాం భూమౌ నవతృణాంకురమ్, యా న జిఘ్రతి సా ధేనుః స్వయోనిద్వారమార్గతః, సద్యో జాతస్య వత్సస్య దేహమాలిన్యసంపదమ్, యథా లిహతి సోల్లాసమ్ తథా జీవస్య కల్మషమ్, భోగ్యం మమ చ లక్ష్మా శ్చ విద్ధి పంకజ సంభవ”** అని వివరంగా చెప్పబడింది.

ఈ విధంగా ఉపపత్తులు అనేకం ఉన్నందువల్ల దోషాలను భోగ్యంగా గ్రహించే గుణం భగవానునకు లోటు లేనిదే! **“పొయ్న్నిన్ఱ ఞానముమ్ పొల్లా ఒళుక్కుమ్ అళుక్కుడమ్బుమ్”** అయిన మనవంటివారి శరీరంలో కోటి నివసిస్తున్న భగవానుని దోషభోగ్యుడని అంగీకరింపనివారు చార్వాకాదులనే మంచివారని అనిపించేవారని **“ఞానప్పిరాన్”** వచిస్తారు. “ఈ విధంగా భగవానునకు ఉన్న దోషభోగ్యత్వగుణాన్ని సాగ్రహంగా లేదని అనేవారు నిర్గుణబ్రహ్మవాదికోటిలో అంతర్భవిస్తారని **“ఎణ్ణువారిడరై క్కళైవాన్ పిళ్ళై”** వచిస్తారు.

చివరిగా, సారంగా ఒకటి చెప్పి ముగిస్తాను. భగవానునకు పలు వేల గుణాలున్నా, ఆశ్రితులపట్ల అతడు అంతులేని ప్రేమను కలవాడు – అనే విషయాన్ని చక్కగా ప్రకాశింపజేయగల గుణాలే ప్రధానాలు. లోకంలో ప్రేమాతిశయాన్ని మనం ఏవిధంగా గమనిస్తాము? అంటే, “ఆహా! దేవదత్తునకు యజ్ఞదత్తుని విషయంలో ఏమి ప్రేమ! ఎంత ప్రేమ! ఇతడు ఎన్ని అపరాధాలను చేసినా అన్నీ అతనికి భోగ్యాలు అవుతున్నాయే తప్ప, ఒకటి కూడా నిందకు కారణం కారణం కావడం లేదే! ఇతని కాలిలో ముల్లు గుచ్చుకున్నా అతని కంటిలో కన్నీరు కారుతున్నదే! ఈ విధంకూడా ఒక అనురాగం ఉంటుందా!” అనే వాగ్విన్యాసం ఉండడం సర్వత్ర గమనిస్తున్నాం. అందువల్ల దోషభోగ్యత్వం, పరదుఃఖదుఃఖిత్వం అనే రెండు గుణాలకు పూర్వపక్షులు భగవానుని



విషయంలో అవద్యాన్ని పల్కిన వారైన తర్వాత, మిగిలిన గుణాల సత్తను అంగీకరించినా ఫలాన్ని పొందేవారు కారు. అల్లుని పొగడదలచినవాడొకడు “మా అల్లునకు ముప్పైరెండు గుణాలలో రెండు గుణాలు మాత్రమే తక్కువ. మంచి చెడ్డలను తాను తెలియడు; ఇతరులు చెప్పినా వినడు. మిగిలిన అన్ని గుణాలు కొఱత లేనివే” అన్నట్లే కదా వీరు చేసే భగవద్గుణప్రశంస ఉండే తీరు. “ఆశ్రితుల విషయంలో భగవానునకు ప్రేమ ఉన్నది” అని అతని ప్రేమగుణాన్ని ఒప్పుకొని కూడా, దాని అతిశయాన్ని సహించేవారు కానందువల్ల, **“జగ్ధస్య కాననమృగైః మృగతృష్ణికేప్సోః కాసారసత్త్వనిహతస్య చ కో విశేషః”** అనే కూరేశుల శ్రీసూక్తికి వీరుకూడా లక్ష్యం కావడంలో కొఱత లేదు. వేయి చెప్పినాగాని, దోషాలను భోగ్యంగా గ్రహించడం ఆహార్యజ్ఞానమే! అని మాటిమాటికి కలత చెంది మాట్లాడేవారిని గూర్చి “అయ్యో! వీరి ఆగర్భదారిద్ర్యం!” అని జాలి (పడాలి) చూపించాలి, అంతే.

ఇంకా ఈ విషయంలో వివరించి తెలుపవలసినవానిని భగవద్గుణరత్న భాండాగారంలో వివరంగా తెలిపాము. చూడండి.

**(42) తిరుమకళుమ్ మణ్మకళు మాయ్మకళుమ్ శేర్న్దాల్,**
**తిరుమట్కే తీర్న్దవాఱెన్కొల్, – తిరుమకళ్ మేల్**
**పాలోదమ్ శిన్ద ప్పడనాకణై క్కిడన్ద,**
**మాలోదవణ్ణర్ మనమ్**

పాల్ ఓదమ్ శిన్ద = పాలసముద్రములో చిన్న చిన్న తుంపురులు చెదఱి పడునట్లు, పడమ్ నాకణై కిడన్ద = పడగలతో కూడిన ఆదిశేషునిడను పర్యంకముపై పరుండిన, మాల్ ఓదమ్ వణ్ణర్ = గొప్ప సముద్రమువంటి తిరుమేనిని కల భగవానునియొక్క తిరు మకళ్ మేల్ మనమ్ = లక్ష్మీదేవిపై (ప్రేమగల) మనస్సు, తిరు మకళుమ్ మణ్ మకళుమ్ ఆయ్ మకళుమ్ శేర్న్దాల్ = శ్రీదేవి, భూదేవి, నీళాదేవి భగవానునితో కలసి సేవించునపుడు, తిరు మకట్కే తీర్న్ద ఆఱు ఎన్ కొల్ = లక్ష్మీదేవి పట్లనే విధేయలై యుండుట ఏమి ఆశ్యర్యము!

**అవతారిక :–** సర్వస్వతంత్రుడగు సర్వేశ్వరుడు ఇట్లు దోషమును గుణముగా భావించువాడైనచో చాలునా? అనినచో, **“పాపానాం వా శుభానాం వా వధార్హాణాం ప్లవంగమ, కార్యం కరుణ మార్యేణ న కశ్చి న్నాపరాధ్యతి”** (రా.యు–116–4) (వానరా! పాపులైనను, పుణ్యశాలులైనను, వధింపతగివారైనను, వారిపట్ల సత్పురుషునిచే కరుణ చూపవలెను. తప్పులు చేయనివారెవ్వరును లేరు.) అని పల్కు దేవేరులు ముగ్గురును అతనితో కూడియుండుటచే అతడు దోషమును గుణముగా గ్రహించుట తగును –

అనుచున్నారు.

**వ్యాఖ్య :–** ఈ పాశురమునకు భగవద్రామానుజుల శిష్యులగు తిరుమలై అనన్దాళ్వాన్ ఒక విధముగాను, పరాశరభట్టర్ వేఱొక విధముగాను అర్థమును చెప్పిరి. అనన్దాళ్వాన్ చెప్పిన అర్థము ఈ రీతిలోనున్నది – **"తిరుమకట్కే తీర్న్ద వాఱు ఎన్ కొల్? మణ్మకట్కే తీర్న్ద వాఱు ఎన్ కొల్? ఆయ్మకట్కే తీర్న్ద వాఱు ఎన్ కొల్?"** అనుచు ముగ్గురు దేవేరుల విషయమున **"తీర్న్ద వాఱు ఎన్ కొల్"** అను ప్రయోగమును అన్వయించి, ఒక్కొక్క దేవేరితో భగవానుడు సంశ్లేషించునపుడు, "ఈ పిరాట్టిపట్లనే భగవానుడు తన సంపూర్ణమైన మనస్సుతో సంశ్లేషించుచున్నాడు" అని చూచువారు తలచునట్లుండుట ఏమి ఆశ్చర్యకరము? అని అర్థము – అని అనన్దాళ్వాన్ పల్కిరి. సంసారియైన సౌభరి అను ముని పలువురు కన్యలను వివాహమాడి, పలు రూపములను దాల్చి, ఒక్కొక్క కన్యకను ఆనందింపజేసి, ఒక భార్యతో అతడు సుఖించుటను చూచినవారికి "ఇతడు ఈమెను తప్ప వేఱొకతెను తెలియడు" అని తోచునట్లుండెను – అని ఇతిహాస పురాణాదులలో విందుము. ఒక మానవుని విషయముననే సాధ్యమైనచో పరమపురుషుని విషయమున ఇట్టిది అసంభవము కాదుకదా! ఇక భట్టర్ నిర్వాహవైఖరిని గమనించెదము.

**(పాలోదమ్ శిన్ద)** – క్షీరాబ్ధిలో చిన్న తంపురులు తొడను పట్టి విడుచువారివలె, భగవానుని తిరుమేనిలో నాల్గు వైపుల చెదఱిపడగా – అని అర్థము. అనన్దాళ్వాన్ నిర్వాహమున–"లక్ష్మీదేవిపై క్షీరాబ్ధిలోని తుంపురులు చిందగా"–అని భావము.

**(తిరుమకళ్మేల్ పాలోదమ్ శిన్ద)** అని అన్వయించి, "శ్రీ పాదములను సంవాహనము చేయు లక్ష్మీదేవిపై క్షీరాబ్ధిలోని తుంపురులు చిందగా" అను అర్థమును గ్రహింపవలెను. భట్టర్ నిర్వాహములో – **"తిరుమకళ్ మేల్ మనమ్"** అనుచు ముందు అన్వయించి, అర్థమును చెప్పనగును.

**(పడ నాకణై క్కిడన్ద)** – భగవానుని తిరుమేని స్పర్శచే విస్తరించిన పడగలను కల ఆదిశేషుడను పడుకపై పరుండియున్న.

**(మాలోద వణ్ణర్)** – గొప్ప సముద్రవలె నల్లనిదై, చల్లని రూపమును గల పరమ పురుషునియొక్క.

**(తిరుమకళ్మేల్ మనమ్)** – "తప్పును చేయనివాడెవ్వడును లేడే"– అని పల్కి, దోషమును సహించునట్లుచేయు లక్ష్మీదేవియు,

**(మణ్మకళుమ్)**– "దోషమును చూచుట ఎందులకు? క్షమించుట ఎందులకు?" అనుచు దోషమునే చూడకుండ, నుండు క్షమయే మూర్తీభవించిన భూదేవియు,

**(ఆయ్ మకళుమ్)** – దోషమును చూడకపోవుటయేకాక, దోషమునే గుణముగా



గ్రహించునదియై, దోషము పరమపురుషుని మనస్సులో పడకుండునట్లు అతని మనస్సునకు తన అనుభవమను తెరను పట్టునట్టి నీళాదేవియును.

**(నేర్న్దాల్ తిరుమకట్కే తీర్న్ద ఆఱు ఎన్ కొల్)** – ఈ విధముగా ముగ్గురు దేవేరులును భగవానునితో సంశ్లేషించుచున్నను, భగవానుని మనస్సు లక్ష్మీదేవిపట్లనే విధేయమై ఉన్నది – అని పల్కునట్లుండుట ఏమి ఆశ్చర్యము! ముగ్గురిని సంశ్లేషించినను, ఒకరికే అత్యంతము విధేయమైయుండుట – అనునది ఎట్లు సంగతము? అనినచో, మొదట ఇచట సంశ్లేషము అనునది నీచులమగు మనము పొందు అల్పానందమనెడి స్త్రీపురుషసంయోగము కాదు. పురుషోత్తముడగు పరమాత్మ స్త్రీ ప్రాయములగు జీవులను కలసి, ఆనందించునపుడు భూమి, నీళా దేవులు పుష్పము, చందనము మొదలగు వానివలెవారి (లక్ష్మీ–భగవానుల) భోగమునకు ఉపకరణములై యుందురు. వారి ప్రణయరసప్రవాహము ఎట్టి ఆటంకము లేక కొనసాగి ప్రవహించునపుడు వృత్తకీర్తనాదులను చేయుటద్వారా దానికి పిల్లకాలువలై యుందురు. భూమి,నీళాదేవులతో పరమపురుషుడు కలసి, ఆనందించునపుడు లక్ష్మీదేవి తన నడుములో, స్తనములలో అతడు స్పృశించినట్లు ఆనందించును. కావున ఇట్లు దేవేరులలో ఎవరితో కలసినను అది లక్ష్మీదేవిని కలసినట్లే అగును. ఈ కారణమువలననే ఇచట సాపత్న్యము లేదు. ప్రాకృతజనులు పలువురు పత్నులతో కలయునపుడు వారు అనుభవించు అల్పానందము ఇద్దఱికి చాలక పోవుటచే, ఒకరితో వేఱొకరు కలహింపవలసివచ్చును. ఇచట మహానందమగుటచే మహాతటాకములలో స్నానము చేయువారివలె పలువురు కలిసి అనుభవించినను ఆనందము మరింత వృద్ధి అగుటచే, స్పర్ధయు, అసూయయును లేదని చెప్పినట్లయినది. ఈ పాశురముయొక్క సారార్థమును శ్రీ పరాశరభట్టర్ శ్రీ గుణరత్న కోశములో **"భోగ్యావా మపి నాంతరీయకతయా పుష్పాంగరాగై స్స్వమం, నిర్వృత్త ప్రణయాతివాహనవిధౌ నీతాః పరీవాహతామ్, దేవి! త్వా మనునీళయా సహ మహీదేవ్య స్సహస్రం తథా, యాభి స్త్వం స్తనబాహుదృష్టిభి రివ స్వాభిః ప్రియం శ్లాఘసే"** (26) అను శ్లోకమున తెల్పిరి.

పెరియ :– అవ :– **నాఙ్ముత్తిరణ్డామ్బాట్టు. (తిరుమకళుమ్) పారాతే పొఱుక్కైక్కడి పిరాట్టిమారరుకే యిరుక్కై ఎన్గిఱార్.**

**(తిరుమకళిత్యాది) అనన్దాళ్వాన్, "తిరుమకట్కే తీర్న్దవాఱెన్గొల్? మణ్మకట్కే తీర్న్దవాఱెన్గొల్? ఆయ్మకట్కే తీర్న్దవాఱెన్గొల్?" ఎన్ఱు పణిక్కుమ్.**

**(పాలోతమ్ శిన్ద) "తిరుప్పాఱ్కడలిన్ కుగ్గ్రామ్ తివలై తిరుముకత్తిలే పడుమ్బడి క్కిడాక త్తిరువనన్దాళ్వాన్మేలే కిడన్ద మాలోతవణ్ణరుడైయ తిరుమకళ్మేల్ వైత్త తిరువుళ్ళమ్,**

